వదన కౌండిన్యవరద శ్రీయనంతపద్మనాభ నమస్తే నమస్తే నమః.

పదకవితా సార్వభౌము లన్నమాచార్యులవారు దీనిచే 'తాళగంధి' యని సంకీర్తనలక్షణమునఁ బేర్కొనిరి. ఇది గద్యలలో 'చూర్ణిక'కు సంబంధించినదిగాన దీనికి తాళగంధి చూర్ణక మని పేరు.

కం. ధరఁ గృష్ణాచార్యాదిక
 పరికల్పిత పదము తాళబంధచ్ఛందో
 విరహితమై చూర్ణాఖ్యం
 బరగునది నిరుక్తనామ భాసిత మగుచున్.

కం. ఛందోగణము లని యతిం
 బొందక తాళప్రమాణమునఁ గడు జెలువై
 కొందఱిచేఁ దచ్చూర్ణం
 బందముగాఁ దాళగంధి యనఁ బొగడొందున్.

దాక్షిణాత్య భాషలలో ప్రధానమగు ద్రవిడ భాషయందు నేకైకముగ గ్రంథమంతయు వచనరూపముగ నున్నవి లేవు.

విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులగు భగవద్రామానుజులువారు గద్యత్రయ మను పేర నొక

---

*(పుట 28 (2 ఆ - 2, 3) ఛందోదర్పణము— సంస్కర్త - పీఠికాకర్త నిడుదవోలు వేంకటరావు, వావిళ్ళ ముద్రణము. 1947.

గ్రంథమును రచించిరి. అందుండి యుదాహరణములను చూపుచున్నాను.

చూర్ణమునకు—

అపార కరుణాంబుధే, అనాలోచిత విశేషా విశేష లోకశరణ్యా, ప్రణతార్తి హర, ఆశ్రితవాత్సల్యైక మహోదధే, అనవరత విదితనిఖిల భూతజాత యాథాత్మ్య, సత్యకామ, సత్యసంకల్ప, ఆపత్సఖ, కాకుస్థ, శ్రీమన్నారాయణ పురుషోత్తమ శ్రీరంగనాథ మమ నాథ నమోస్తుతే. (శ్రీరంగ గద్యమ్)

ఉత్కలికా ప్రాయమునకు—

పరమయోగి వాఙ్మనసా పరిచ్ఛేద్య స్వరూప స్వభావ స్వాభిమత వివిధ విచిత్రానంత భోగ్యభోగోప కరణ భోగస్థాన సమృద్ధానంతాశ్చర్యానంత మహా విభవానంత పరిమాణ నిత్యనిరతిశయ శ్రీ వైకుంఠ నాథ— శరణాగతి గద్యమ్.

వృత్త గంధికి—

ప్రబుద్ధ ముగ్ధాంబుజ చారులోచనం - సవిభ్రమ భ్రూలతమ్ - ఉజ్జ్వలాధరం - శుచిస్మితం - కోమల గండమ్ - ఉన్ననమ్ - ఉదగ్రపీనాంస విలమ్బి కుండ లాలకావళీ బన్ధుర కంబుకంధరం. వైకుంఠగద్యమ్.

శ్లో. ప్రబుద్ధ ముగ్ధాంబుజ చారులోచనం
సవిభ్రమ భ్రూలత ముజ్జ్వలాధరం

శుచిస్మితం కోమలగండమున్నసమ్
ఉదగ్ర పీనాం స విలమ్బి కుండలా
లకావళీ బన్ధుర కంబుకంధరం.

కన్నడ భాషయందు పదునొకొండవ శతాబ్ది వెనుకనే యిట్టి రచనలు వెలసినవి. ఆ వాఙ్మయమున బసవన మొదలు శివభక్తు లందఱును వచనములను రచియించిరి. అందులో వీరశైవమత ప్రవర్తకుఁ డగు బసవన, షట్ స్థలవచన, కాలజ్ఞానద వచన, మంత్ర గోప్య వచన అను మూఁడు వచనగ్రంథములు రచియించినాడు. ఇవి పాటలవలె పాడుట కనుకూలముగ నున్నవి.

ఉదాహరణము : షట్ స్థల వచనము.

నరె కెన్నెగె, తెరగల్లకె శరీరగూడ వగదమున్న
హాల్లుఘోగి బెన్నుబాగి అన్యరిగెహాంగాదమున్న
కాలుమేలె కయ్యనూరి కోలహిడి యదమున్న
ముప్పిందొప్ప వళియదమున్న మృత్యుముట్టదమున్న
పూజిసు నమ్మ సంగమ కూడలి దేవరా!

ఇది బసవని యిష్టలింగ మగు కూడలి సంగమేశ్వరునిపైఁ జెప్పబడినది. ఇట్లే అక్కమహాదేవి వచనములు, అల్లమప్రభువు వచనములు మోళిగమారయ్య వచనములు అనుపేర 225 భక్తుల వచనములు వెలయుచున్నవి.

ఇప్పటివలె పూర్వకాలమున ముద్రణాది సౌకర్యములు లేకపోవుటచే, వేదమువలె కంఠస్థము చేయు పద్ధతియే యుండెడిది. మఱియు పద్యరూపమునను న్నచో విషయము ధారణ చేయుటకు వీలుగ నుండును. ఈ యభిప్రాయముచేతనే, మన శాస్త్రీయ గ్రంథములు, నిఘంటువులు మున్నగునవి, సంస్కృతము ననుసరించి తెనుగున పద్యరూపముతో పూర్వము వెలసినవి. నేడు వచనయుగము గాన నవి వచనములో రచితము లగుచున్నవి.

అద్యతన కాలమున నీ వృత్తగంధి రచనమును వెలయించి యీ సంప్రదాయమును నిలువఁబెట్టినవారు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు. వారి "ప్రాఁదెనుఁగుఁగమ్మ"[1] యందీ సంప్రదాయము వెల్లివిరియుచున్నది. అదియంతయు నచ్చ తెనుఁగు. దానినుండి యుదాహృతులు.

గద్యము :

"సిరిఁ దాల్చు ఱేఁడొగిఁ జిన్ని చూడ్కులఁ జూచు తెనుఁగు చదువుల రచ్చ తీర్పరులార! గ్రిందను గైవ్రాలు సేసిన నేనయా! అణకువ మెఱయుచు నా యోపుకొలఁది తెనుఁగు చవులగుఱిచి జాను మివు

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక – సం. 2 సం. 2 పుటలు 255 – 274.

లంగఁ దొలి తెనుఁగు నుడులనఁ దేటతెల్లగను, విన్నప
మొక్కండు వినిపింతు మిమ్ము.

పద్యము :

సీ॥ సిరిఁబాల్పు శ్రేఁడొంఁగి జిన్నిచూడ్కులఁ జూచు
తెనుగు చదువుల రచ్చ తీర్పరులార!
క్రిందను గై వ్రాలు చేసిన స్నేనయా
యఁణకువ మెఱయుచు నా యోపుకొలఁది
తెనుఁగు చదువుల గుఱిచి జాను మివ్వులంగ
తొలి తెల్గు నుడులను తేటతెల్లగను
విన్నప మొక్కండు వినిపింతు మిమ్ము.

వారే యీ కమ్మలోనుండు విశేషము నిట్లు తెలిపి
యున్నారు.

ఇక్కమ్మ నుడుల నాయిచ్చమై నేను గూర్చితి,
నా నాల్క కనువగునట్లు, చదువరి వీనుల కింపెడు
నట్లు. పద్దెమ్ము లివి యని పేర్కొ్రివ్వ నేను. పద్దెంబు
లని పల్కఁ ప్రాబడిఁ బరికించి కీడని దూఱంగఁ దగదేరి
కేని. గద్దె కూర్పునకైన కట్టడి లేద - గద్దియ కాదీని
గడియింప నురదె?

మం॥ ఇక్కమ్మ నుడులనా యిచ్చమై నేను
గూర్చితి నానాల్క కనువగునట్లు
చదువరి వీనుల కింపెడు నట్లు
పద్దెంబు లివి యని పేర్కొ్రివ్వ నేను

సీ. పద్దెంబు లిపి యని వ్రాఁబడెఁ బరికించి
కీడని దూఱంగఁ దగదేరి కేని
ద్వి. గద్దె కూర్పునకైన కట్టడిలేద
గద్దియ కాదీని గడియింప నురదె

చివర :

అక్కనసిగలోనఁ జొక్కిన మోమున సానుల నెలకొల్పు మాను దొఁలు సిరి, సేవ, నుడి మెఱుఁగు సమకూర్పుమంత్రు తెనుఁగు చదువుల రచ్చ తీర్పరులెల్ల. భళిరె! భళి! భళిరె! భళి! భళిరె. భళి!

| | |
|---|---|
| పర్లాకిమిడినుండి,<br>యొక వేయుఁ దొమ్మిదినూఱులుఁ<br>బదమూఁడు నగునేఁట, నాలు<br>వవుతుది నెలనాఁటనంచిపుచ్చినది | ఇట్లువిూయడియరి,<br>నీడ నేనిడితి గ్రైవ్రాలు<br>గిడుగు వెంకట<br>రామమూర్తి |

సీ. అక్కన సిగలోనఁ జొక్కిన మోమున
సానుల నెలకొల్పు మాను దొరలు
సిరి, సేవ, నుడి మెఱుఁగు సమకూర్పుమంత్రు
తెనుఁగు చదువుల రచ్చ తీర్పరులెల్ల
భళిరె! భళి! భళిరె! భళి! భళిరె! భళి! పర్లాకి
మిడినుండి యొక వేయు తొమ్మిదినూఱు
లుం బదమూఁడును నగునేఁట నాలు
వవు నెల తుదినాఁట నంచి పుచ్చినది.

గీ. ఇట్లు మీ యడియరి సీడ నేనిశిఠి
గైద్రావాలు గిడుగు వేంకటరామమూర్తి.

ఇంక నొక విశేష మేమనగా నధునాతన కాల మున ముఖపత్రములలోను, విషయసూచికలోను నీ వృత్తగంధి నియమమును పాటించుట. చూడుఁడీ క్రింది యుదాహృతులు. కందుకూరి వీరేశలింగము పంతులుగారి రచన ముఖపత్రము——

శ్రీరస్తు.
శుద్ధాంధ్ర భారత సంగ్రహము.
(వినుఁడీ)
ఇది
చెన్నపురిని మిగుల,
వాసిని గన్న
కొల్లా సుబ్బరాయలు సెట్టియు
,, గురుసామి సెట్టియు
నను, వారి కంకితముగ
వసుధలోఁగల పట్టణములలోన గణ్యతకు నెక్క,
గౌతమీనది తూర్పుగట్టున నలరారి
రాజమహేంద్రవర మను పేర,
నమరు పట్టణరాజంబునందునుండు
కందుకూరి వీరేశలింగ మను నాఖ్యఁ
బరఁగు కవిచేతఁ బండితపామరులకుఁ
నింపు పుట్టునట్లుగ రచియింపఁబడెను.

ఇది యంతయు సీసపద్యము.

సీ. శ్రీరస్తు, శుద్ధాంధ్రభారత సంగ్రహ
మును వినుఁడి యిది చెన్నపురిని మిగుల
వాసినిగన్న కొల్లా సుబ్బరాయలు
సెట్టియు గురుసామి సెట్టియు నను
వారి కంకితముగ వసుధలోఁగల పట్ట
ణంబులలోన గణ్యతకు నెక్కి
గౌతమీనది తూర్పుగట్టున నలరారి
రాజమహేంద్రవర మను పేర

గీ॥ నమరు పట్టణరాజంబునందునుండు
కందుకూరి వీరేశలింగ మను నాఖ్యఁ
బరఁగు కవిచేత పండితపామరులకు
నింపు పుట్టునట్టుగ రచియింపఁబడియె.

(చెన్నపురి: శ్రీ నిలయముద్రాక్షరశాల ౧౮౭౯సం॥)

విషయసూచిక: కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి రచన.

శ్రీరస్తు.

బిల్వేశ్వరీయము

సనకాదిముని సూతశౌనక నైమిశవిపిన సంకేతార్థ
వివరణము.

అనునీ విషయములతో నింపుగా మున్నాట
నల్వదేన్పద్యముల్ నల్వఁరుట బిల్వేశనామక విలసిత
మగునిద్ది ప్రథమ బింబము, బిల్వపతి చరిత్ర.

ఇది సీసపద్యము.

శ్రీరస్తు బిల్వేశ్వరీయము విషయసూ
చిక, పుట, సంఖ్య, పీఠిక, కథాముఖము
శౌనకప్రముఖ క్షేత్రజిజ్ఞాస
తత్సూతకృతము క్షేత్రప్రశంస

ఆకారణమున బిల్వారణ్యము ప్రశంస
తద్వనదేవతాతపము మెచ్చి
శివుఁడందు బిల్వేశుఁడవుట సనకముఖ
మునులసంప్రార్థనమునను బిల్వ
నాథుఢక్కవలన నాదభేదంబులు
గల్గి యయ్యవియె యక్షరములగుట
ఆ శివసూత్రరహస్యార్థమక్షర
ములు బిల్వములవుటవలన నక్ష
రేశుఁడే బిల్వేశుఁడౌ శివుండనుట
ఆర్ద్రోత్సవ తత్త్వార్థమారోనరుట
సనకాదిముని సూత శౌనక నైమిశ
విపినసంకేతార్థ వివరణమును
నీ విషయములతో నింపుగా మున్నాట
నల్వదేన్పద్యముల్ నల్వలరుట
బిల్వేశనామకవిలసితంబగు నిద్ది
ప్రథమబింబము బిల్వపతి చరిత్ర.

6 పుటలలో విషయసూచిక యంతయు నూట యెనిమిది సీసపాదములతో చెప్పబడినది. చివరగీతి.

ఇది యష్టోత్తర శతాంఘ్రులెనసీనయది
సీసమాలిక నాదాత్మ సిద్ధలింగ
మిందునీతేటగీతియె బిందుపీఠ
మిదివిషయసూచికయగు బిల్వేశమూర్తి

పద్యతత్త్వమునుబట్టి చూచిన వచనవాఙ్మయము తొలుత వర్ధిల్ల నేరదు. భావధ్వనిప్రధానము. మనసులోని భావములను పైకి తెలియజేయుటకు ధ్వనియే మొదటయాధారమైనది. అదియే వర్ణసముచ్చయాత్మకమైన భాషగా పరిణమించినపుడు గేయరూపమైనది. ప్రాణములవంటి ధ్వనులకు నక్షరములు శరీరప్రాయములు. కాబట్టి యీ యక్షరములకు స్థిరత్వము గల్పించు లిపియేర్పడినగాని, భాష సాహిత్యరూపమున వెలసి స్థైర్యమును బొందజాలదు. లిపి యేర్పడకముందు గేయరూపమగు భాష నాలుకయందే నాట్యమాడుచుండును-అప్పుడు నాలుకయే పలక; మేధస్సే పుస్తకము; నోటిమాటయే వ్యాఖ్యానము - అట్టి గేయరూపమగు పదవాఙ్మయము నుండియే విశిష్టమగు పద్య వాఙ్మయ ముద్భవిల్లును. కావున మొదట పద్యవాఙ్మయమే ప్రచారములోనికి వచ్చును.

మఱియు తెనుగుభాష స్వరప్రధానమగు సంగీతమును వర్ణప్రధానమగు సాహిత్యమును సమ్మేళము చేసి యవ్యక్త మధురమగు గానమును సువ్యక్త మధురమొనరించునది గాన కేవల వచనము లుద్భవిల్లుట కవకాశమే లేదు-అయినను పైని వివరించిన గద్యవచనసాహిత్యసంప్రదాయముల ననుసరించి తెనుగు వాఙ్మయమున ప్రాచీనకాలమునుండి నిరువదియవ శతాబ్ది

ప్రారంభము వఱకు నెట్టి పరిణామమును బొందినదియు యుగవిభజనమూలముగ దెల్పుచున్నాను.

గద్యయను సంస్కృతపదమునకుఁ దద్భవ రూపము గద్దియ. దీని రూపాంతరము గద్దె. పై బిరుదు గద్యల నేస్థలమునందా బిరుదములు గలవారు కూర్చుండగా సంబోధించుచు చదువుదురో ఆస్థలము నకు 'గద్దె' అని పేరు వచ్చినది. సాధారణముగ నాస్థానమున సింహాసనాసీనుడైన రాజునుగూర్చి యీ గద్యలు చదువుదురు గాన సింహాసనమునకు గద్దె యని పేరు రూఢిమైనది. బిరుదుశబ్దము వీరశబ్దమునకు మహారాష్ట్రీ ప్రాకృతరూపము కావున 'బిరుదుగద్దె' బిరుదుగద్దెలు అను రూపము లేర్పడిన వెనుక నీ గద్దె శబ్దము రూఢిమై యుండును. కాబట్టియే, గద్యఅను పదము ప్రకృతిలో వచనమునకు, వికృతిలో సింహా సనమునకు పేరైనది. తెనుగులో గద్దె సింహాసనమున కర్థమగుట విస్మృతమగుటచే కాబో లిటీవలివారు సింగపుగద్దె యనియు సింగపుఁబీట యనియుఁ 'దద్భవ' పదసమాసములను గల్పించియున్నారు.

ఇట్లే 'వచనము'నకుగూడ తొలి నున్న సంప్ర దాయార్థము ననుసరించి, తిక్కన, వచనము లేకయ వర్ణన రచియింపగ వచ్చునని చెప్పియున్నాడు. వర్ణ నలు తఱచుగ దీర్ఘసమాసభూయిష్ఠములై ఉత్కలికా ప్రాయములుగ నుండుటచేత, నా గద్యభేదము నే

తీక్కన వచనముగా చెప్పియున్నాడు. భారతమున 'మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ కృతుల్' అని గద్యను వాడియున్నాడు.

క్రీ. శ. 1224 లో పద్యమయమగు నోపిలిసిద్ధి శాసనమున నడుమ వచన భాగమునకు 'గద్దె' అని కలదు.

గద్యములైన, వచనములైన మాత్రాచ్ఛంద స్సంఘటితములగుటచే కాబోలు, కొందఱు కవులు పద్యకావ్య రచనలను, వచనకావ్యరచనలను వచన కావ్యములుగా పేర్కొన్నారు. హరిభట్టు వరాహ పురాణములో 'నవరసాలంకార బంధురంబుగా నొక్క ప్రబంధం బాంధ్రభాషాభవ్యంబగు వచనకావ్యంబుగా రచియింపబూనిన సమయంబున, నారసింహపురాణో త్తర భాగ మప్పుడంధ్రభాషను వచనకావ్యం బొనర్చె.' అని చెప్పియున్నాడు. లోకేరావు సోమన యను కవి యిట్లే శివరాత్రిమాహాత్మ్యమును పద్య ప్రబంధమును వచనకావ్యమని చెప్పియున్నాడు.

తెనుగుభాషలో పదమూడవ శతాబ్దినుండి పాటలుగా పాడదగిన వచనములు వెలయుటచేతను, నవి పైగద్యభేదములలో నొకటి యగుటచేతను, నవి ప్రబంధములయందు వెలయక నేకైకముగ నొక గ్రంథ రూపముగ లభ్యమగుటచేతను, తొలి వచనగ్రంథము లవియే యని నిర్ధరింపవచ్చును.

ఏ వాఙ్మయమునందైన తొలుత గేయపద్య రచనలేగాని, గద్యరూపములగు వచనకృతులు వర్ధిల్ల నేరవు. అతి విస్తృతమగు సంస్కృత వాఙ్మయమున వేళ్లపై లెక్కపెట్టదగినన్ని కాదంబరి, దశకుమార చరిత్ర మొదలగునవి కలవు. శ్లోకరచనకన్న యను ప్రాసాద్యలంకార సహితమగు గద్యరచన కష్టతరమగుటచే గాబోలు "గద్యం కవీనాం నికషం వదంతి" యను నానుడి యందే యున్నది.

### నన్నయ పూర్వయుగము

నన్నయకు ముందుగల వచనస్వరూపమును దెలిసికొనుటకు శాసనములే యాధారములు. పూర్వము తెనుగుదేశముల నేలిన శాతవాహనులు ఇక్ష్వాకులు, పల్లవులు, సాలంకాయనులు మొదలగు వారి శాసనములు ప్రాకృతభాషలో నున్నవి మనుష్యులపేర్లు, ఊళ్ళపేర్లు, మొదలగునవి మాత్రమే తెనుగున గలవు. చాళుక్యుల కాలమున తెనుగు రాజభాషయైనవెనుక తెనుగుశాసనములు బయలు వెడలినవి. ఇంచుమించుగ నా కాలముననే రేనాటిచోళుల శాసనములు తెనుగున కన్పట్టుచున్నవి. ఇప్పటికి లభించిన శాసనములలో మొదటి తెనుగు శాసనమును[1] నా

1. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు–నన్నయకు పూర్వపు ఆంధ్రభాష, వృషసంవత్సరాది సంచిక, 5–16 పుటలు.

2. చాళుక్య భీమమహారాజు గర్త్రవరపు శాసనము, భారతి 1928.

కాలపు వచనస్వరూపమును దెల్పుటకై క్రింద యిచ్చుచున్నాను.

స్వస్తిశ్రీ సోఱమహారాజుల్లొళన ఇన్బుఱోళి అణపోతులు రేవణకాలు వృద్ధణకాలు ఇచ్చిన పన్నస పెన్బాఱె ఇశతేనికిన్ తేని ఆచ్చిన పఞ్చమహాపాత కున్దకున్.

క్రీ. శ. 850 నాటికి పద్యమయ శాసనములు లభించుచున్నందున యీ కాలమునాటి వచనశాసనములోని[2] భాగము వచన మెట్లున్నది తెలిసికొనుట కుదాహరించుచున్నాను.

. [వి] జయాదిత్య పాదపద [ద్మ] భ్రమరాయమాన శ్రీమత్పండియరాజు గుణగణాభరణుణ్డు [ద]న కాని యీశ్వరునకుం గార్తికేయుండునుబోలె చాపష్టికళాపిశారదుండు పన్డొరంగులు అయ్యమప్రెగ్గడలుంగరనమ్మున పండరంగును ఈ ధర్మనిర్వహానోద్యోగమ్మునకు బృహస్పతిసమానులైన ప్రెగ్గడ కా(డెయ) గారి కొడుకు బెజెయరాజు సమ[ర్థుణ్] నని ఆత్మానన్మతంబునం బన్చిన......

మొదటిదానిలో, 'ఱ' అను వింత ధ్వనిగల యక్షరము, బిందువునకు బదులు వర్గపంచమాక్షరములు లిఖింపబడుట. సమాపక క్రియ లేకపోవుట వాక్యరచనయందలి వైలక్షణ్యము తరువాతి శాసనముల వర్గపంచమాక్షరముతో బిందువుల్కూడ వ్రాయ

డుట సమాపకక్రియలతో నన్వయసౌలభ్యము గలిగి యుండుట మొదలగువానినిబట్టి వచనరచన మెట్లు మారినది తెలిసికొనవచ్చును. గ్రంథవిస్తరభీతిచే నాయాకాలములలో బుట్టిన శాసనము లందలిభాషను, విశేషములను నిందీయజాలక పోయితిని. దిక్ప్రదర్శనముగా నన్నయకుముందు వచనరచన మాత్రము చూపితిని.[1]

---

1. పూర్వపు వ్రాతలయందీక్రింది లక్షణములు గన్పట్టును.

1. పూర్ణానుస్వారములు వాడుట. (కూంతురు-ఆంపెది)

2. పూర్ణానుస్వారములకు ముందు పరుషములు ద్విత్వములు వ్రాయుట. గ్రహంబ్బునంగ్గా, పుంత్తి, కంక్కపత్రంబ్బు॥ మొదలైనవి.

3. నాంణ్డు, వాంండు, వాటు - మూడు రూపములును కన్పట్టును.

4. బ్రహ్మ, సింహ, జిహ్మ-బంహ్మ - సింహ్వ - జింహ్వ-జిహ్వ - గా వ్రాతలలో నుందును.

5. దుఃఖ-దుఖ్ఖ-చేయు-సేయు-శేయ, శాయ.

6. సంబోధనలు దీర్ఘాంతములుగా నుండెను. పరంతప! రాజేంద్ర!

7. విత్వము సాధారణముగా వ్రాయరు.

8. ఋ-రు-భేదము పాటింపబడదు. శత్రు-శత్రు - పౌత్రుండు పౌత్రుండు-రుద్రుని రుద్రుని.

9. ప్రాగ్జ్యోతిష-ప్రాగ్జ్యోతిషకు-వివస్వంతు-వివస్వంతు.

10. వలపలగిలక వ్రాయుటయే సర్వత్ర కానబడును. (పొర్వక్) వర్తకులు.

నన్నయయుగము-నన్నయ వచనరచన

ప్రాచీన మహాకవుల చంపూ గ్రంథములలోని వచనరచనలలో నన్నయ వచన రచన పద్య రచన వలె, ప్రసన్నమై, యక్షర రమ్యత గలిగి, యచ్చ్పన, పది పండ్రెండు పంక్తుల కెక్కువగాక హృదయంగమముగ నుండును. నన్నయ పద్యముల యందువలె కొన్ని నియమములు గద్యమునకుగూడ పాటించియున్నాడు. వచనము వ్రాయుటకు

1. పద్యములం గూర్పవలనుపడని వంశక్ర మాది వృత్తాంతములు చెప్పుట.

2. విరివిగా చెప్పవలసిన కథలను సంగ్రహిం చుట.

3. ఏకధారగా నుండి విసువు జనింపజేసెడు పద్యపఠనమునుండి పాఠకుని మఱల్చుట.

4. అచ్చటచ్చట, రత్నములవలె లోకోక్తులు పొదిగించుట.

5. ఏకసమాస సముచ్చయాత్మక వాక్యరచన వీడుట.

6. వచన ప్రారంభము పద్యపాదమువలె నడి పించి, వృత్తగంధిగా భాసింపజేయుట అనునవి.

ఇందు చివరదానికే వఱకే యుదాహరణలు చూపి తిని. నేటి, యాంగ్లేయభాషావచనపద్ధతి ననుసరించి,

వాక్యవిరామాది చిహ్నము లుంచిన పద్యవిద్యకు గాదు గద్యవిద్యకు నాద్యుడు నన్నయ్య యేయని మనము గ్రహింపగలుగుదుము

శివకవి యుగము - నన్నెచోడుని వచనరచన

నన్నయలో సగము పద్యము సగము గద్యమున్న నన్నెచోడుని కవితలో అయిదింట నొకపాలు గద్యము గలదు. అది సంస్కృతపద జటిలమై, అలంకారసహితమై యుండును. యజ్ఞ సంభారవర్ణన, వివాహమంటపవర్ణన మున్నగువానిచోట్ల సంస్కృత పదబంధురంబై యున్నది. శ్రుతిసామ్యమును పాటించుటయేగాక, ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము మొదలగువానిని వాడినాడు. మొత్తముమీద కుమార సంభవ వచనరచన, పద్యరచనయంత భావబంధురము కాదు.

వచనములు - విన్నపములు - కృష్ణమాచార్యులు[1]

వచనవాఙ్మయ ప్రథమాచార్యుడు[2] క్రీ. శ. 1300 ప్రాంతము.

ఈతడు ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమున నోరంగలున విలసిల్లినట్లు 'ఏకశిలానగరవృత్తాంతము'

1. భారతి. పార్థివ భాద్రపదమున నాన్యాసము పై శీర్షికతో ప్రకటితమైనది.

2. వచనవాఙ్మయ ప్రథమాచార్యుడు. శీర్షిక.

ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము చెప్పుచున్నవి. ఈతనిని తాళ్లపాక అన్నమాచార్యులు (1408-1503) పేర్కొనుటచేతను, వచనములు, విన్నపములు వ్రాసి సంకీర్తనలు వ్రాయుటకు తొలుత దారి చూపినవా డగుటచేతను నీతని ప్రథమాచార్యుడని తెలిపితిని.

సింహగిరి నరహరి వచనములు †

ప్రసిద్ధవైష్ణవ క్షేత్రమగు శ్రీ సింహాచలక్షేత్రమున నీతడు నివసించిన కారణమున నా దేవునిపై నీ వచనములు రచియించెను. ఇది "సింహాగిరి నరసింహా దయానిధీ"యను మకుటముతో నుండును. ఇవి యముద్రితములు—

దేవా! జయ జయాపరంధామ! పరమ పురుష! పరమాత్మప్రకాశ! అమృత! అచలాచల! అవ్యక్త! అగణితదయాంబోధి-అనాధిపతివైన స్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధి!

ఏడు రామాయణంబులు, పదునెనమిది పురాణంబులు, ద్వాదశస్కంధంబులు, భగవద్గీతలు, సహస్రనామంబులు చదివి రేమి విన రేమి, వ్రాసి రేమి, ఈ సంకీర్తనకు వేయవపాలింటికి సరిరావు. కడమ సంకీర్తన లనేకసారులువిన్నారు. ఇందుకు తప్పరాదు ......మీ దాసులకు కులగోత్రం బెన్న నేమిటికి?

---

† చూ. శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు. వ్యాసము. భారతి.

మాయతి రామానుజముని పరంధాత అనాధిపతియైన సింహాగిరి నరహరి నమో నమో దయానిధీ!

శఠగోపవిన్నపములు

అఖిలాండకోటి బ్రహ్మాండనాయికా! నీకు పునః పునః ప్రదక్షిణ నమస్కారంబులు. శరణాగత వజ్రపంజరా! నా దురితంబులు ఖండించి మీదాసాను దాసులకు దాసుండనై వర్తించే బుద్ధిపుట్టించి, నాదుర్గు ణంబులు చూడక మీ పతితపావన బిరుదు ప్రతిష్ఠించి, పతితుండనైన నన్ను రక్షింపవే ఆశ్రితజనమందార అఖిల లోకాధార! నమో నమో లక్ష్మీవల్లభా!

ఎఱ్ఱాప్రెగడ యుగము.

ఎఱ్ఱన నృసింహ పురాణమున (5-81) స్తంభో ద్భవ వచనమును నొకవచనమును రచియించి యున్నాఁడు. అది ఉత్కలికా ప్రాయమనదగును.

"అమ్మహాస్తంభంబున విజృంభమాన జిహ్వా వివృతవదన గహ్వర స్ఫురదనహ్య కహకహోత్తర్జన గర్జా స్ఫూర్జితంబును, వికట కఠోర ఘోరదంష్ట్రాదండ దారుణ దహన దందహ్యమాన దశదిశాభాగంబును, విపుల కపిలక్రూరతరల తారకా తరంగితోద్వృత్త వృత్తాయతేక్షణ రూక్షరదవస్ఫులింగ పూరిత భువన రంధ్రంబును నభంగభ్రూభంగ భయదపాలభాగ ప్రాంతభంగుర భ్రమరక దురవలోకనంబును విశ్వధురం ధరస్కంధ పరిణామా పరితోదగ్ర కింజల్క పుంజ

పింజరిత భాసుర కేసరి ప్రసర విప్రకీర్ణవితాంతరిక్షంబును, హేమంత కమలతంతు కాంతికోమల రోమవల్లరీ గహన కరాళకర్ణ కోటీర ఘటితకుండల మరీచి మంజరీ రంజిత గండస్థలోద్భాసితంబును, కల్పాంత పవన కల్పానల్ప దరోల్లసిత సమీర సంపాదిత కంపాకులిత కులధర నికరంబును. సముత్కటోత్కటనకోటి కుట్టన కుంఠిత కుటిలకుంతలాయమాన శ్యామజీమూత సకలమనోజ్ఞ మూర్ధభాగంబును శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ ప్రముఖ నిఖిల లక్షణోల్లక్ష్యమాణ వక్షస్థల ప్రస్థాల ప్రారంభ నిర్విలంబ లక్ష్మీ సమారోహణోత్సవంబును, భక్తభజనవచన వర్తన చింతనానురోధ నిరవగాహన కరుణాసుధా పూర పూరిత పుణ్యహృదయ ప్రదేశంబును."

## ప్రతాప చరిత్ర

ఈ యుగమునకు సంబంధించినది ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర. ఇది కాకతీయరాజుల వృత్తాంతమును దెలుపు తొలివచనకృతి-తొలిచారిత్రకకృతి. ఏకామ్రనాథుఁడు, ఏకోరాముఁడని ప్రసిద్ధికెక్కిన శివాచార్యుఁడు మల్లంపల్లివారికి మూలపురుషుఁడు.[1] "అన్యవాద కోలాహలము" అను గ్రంథరచయిత యితఁడే-కాసె సర్వప్పకవి సిద్ధేశ్వర చరిత్రయందు-

(1) చూడుఁడు. 'మల్లంపల్లి బుచ్చికవి' అను వ్యాసము. (త్రిలింగ, 24-12-49, 3-1-50)

'ఆ ఏకామ్రనాథు ననుమతిఁ జేసి' అని యీతని కృతిని పేర్కొన్నాడు-ఇది వరంగలు శైవధర్మ ప్రచారిణీ వారిచేతను, ఆంధ్రసాహిత్య పరిషత్తువారి చేతను ప్రకటితమైనది.

### శ్రీనాథ యుగము

శ్రీనాథుఁడు ప్రాచీన గద్యరచనా సంప్రదాయము ననుసరించి భీమఖండమున (3-21వ) నొక చూర్ణికను రచియించియున్నాఁడు.

ఓం జయజయ దేవదేవ గంధర్వ సిద్ధవిద్యాధర చారణ కిన్నరకింపురుషు లహంపూర్వికాసంఫుల్లపుటంబులగు చేతస్సంపుటంబులంబటపుటనగు భక్తి విశేషంబుల శేషాహికటక భూషా విశేషాభిరామంబులగు మీ కోమల శ్రీపాద కిసలయంబుల ఘుసృణమణీ కోటీర కోటీ విటంక సందానిత మందార మాలికా మకరంద బిందు ధారాధోరణీ ప్రవాహంబుల నహరహంబును నభిషేకింతురు కంఠేకాలా! మీ కంఠమూలంబునఁ గలువ దండకైవడిం గనుపట్టు కరాళ కాలకూట విషమషీకళంక పంకచ్ఛాయాచ్ఛటాగుళుచ్ఛంబు వలన నిఖిలలోక సంరక్షుంబు నిగమవ్యాఖ్యాతంబు.

..............................................

ముక్కంటీ నీకు మ్రొక్కులు, శివా! నీకు నవాంజలి, భవా! నీకు నభివాదనంబు, పాండురంగా! నీకు దండంబు, అష్టమూర్తీ నీకుఁ బ్రతిష్ట. పినాకీ నీకు నమస్కారంబు.

శ్రీమన్మహాదేవ! దేవదేవతారాధ్య! దక్ష వాటీ పురాధ్యక్షా! ఆపద్ధ్వాంత దివాకరా! పరమ దయాకరా! జయజయ శ్రీ భీమేశ్వరా! నమస్తే నమస్తే నమః.

హారవిలాసమున (3-12) నిట్టి గద్యలుగలవు.

జయజయ జగన్నాథ! జగజ్జననస్థితిసంహారకారీ! జంభారిప్రముఖ నిఖిల బర్హిర్ముఖ శిఖామణీమయూఖ మంజరీ రంజిత పాదపీఠ!...అనంత! అద్వితీయ! నిరంతర సమసోపాధిక సచ్చిదానంద స్వరూప! నమస్తే నమస్తే నమః.

పోతన భాగవతమున వచనము లన్నియు సంస్కృత సమాసబంధురములై, ప్రాచీన గద్యరచనా సంప్రదాయములను తలఁపులకుఁ దెచ్చుచుండును. వర్ణనల పట్టున నీసంప్రదాయము చక్కఁగా పోతన పాటించినాఁడు. అటవీవర్ణనమున సమాసరచన మావశ్యకమను నాలంకారిక నియమము గుర్తించి గజేంద్రమోక్షణమున (8 సం. 24) "అది మఱియును. మాతులుంగ లవంగ లుంగచూత కేతకీ భల్లాతకా మ్రాతక సరళ పనసబదరీ వకుళవంజుల వటకుటజకుందకురవక కురంటక కోవిదార ఖర్జూరనారికేళ సింధువారచందన పిచుమంద మందార జంబూ జంబీర...యిత్యాది వచనము వ్రాసి యున్నాఁడు.

దశమస్కంధమున (1745) రుక్మిణి గౌరీ దేవి మందిరము వెలువడునపుడు చెప్పిన వచనము ఇట్లు మేఘమండలంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున మృగధరమండలంబు నిర్గమించి చరించు మృగంబుకైవడి...... దేవదానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయ పరిభ్రాంత మంధరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవ మధ్యంబుననుండి చనుదెంచు నిందిరా సుందరీ వైభవంబున.

శ్రీ కృష్ణదేవరాయ యుగము.

ఈ యుగమున సాహిత్యమున వర్ణనా ప్రధానములగు ప్రబంధరచనయు మతమున వైష్ణవమును ప్రధానస్థానము నాక్రమించినవి. కావున సాహిత్యమున ప్రత్యేక వచనరచన కవకాశము లేకపోయినది. అయిన గద్యలక్షణముల ననుసరించి కొన్ని వచనములు వెలసినవి. సులభశైలిలో వేదాంతవాఙ్మయము ప్రపంచించిన దత్తాత్రేయ శిష్యవర్గ మీ కాలములోనే తమ రచనలు చేయుటకు ప్రారంభించిరి కావున నీ యుగమునకుఁ గూడ సాహిత్యమున కున్నంత ప్రాధాన్యము లేకున్నను, కొంత విశిష్టతకలదని యెంచవచ్చును.

## తాళ్ళపాక పెదతిరుమలయ్య
## వేంకటేశ్వరవచనములు - (1468-1553)

ఇవి, తిరుపతి దేవస్థానమునసుప్రసిద్ధ సంకీర్తనాచార్యులగు తాళ్లపాక అన్నమాచార్యులవారిపుత్రులు పెద తిరుమలయ్యగారు రచించినవి. శ్రీ వేంకటేశ్వరా! అను మకుటముతో ప్రశస్త రచనగల నీతిని వచనలలో 166 నేఁడు లభించుచున్నవి—ఇవి 30 రాగములతో పాడవచ్చును. ఇందు మంచి భావములు ప్రపంచితములై యున్నవి. మచ్చునకు రెండుదాహృతులు.

1. "ఇది లోకదృష్టాంతంబు—నీ చరిత్రలు గణుతింప నలవిగావు, మఱియు నితరమార్గము లెండమావుల నీళ్లవంటివి. మిణుంగురు బురువుల ప్రకాశము వంటివి. కాకిచేగడల సొమ్ముపంటివి. కప్పచిప్పల వెండివంటివి. ఇట్టిభ్రమలం బొరలక నీ శ్రీ పాదంబులే గతియని యున్నవారలు ధన్యులు శ్రీ వేంకటేశ్వరా!"

వేంకటేశ్వర వచనములు.

శ్రీ వేంకటగిరి దేవా నా దేహంబు నీ వుండెడి నిత్యనివాసంబు; నాజ్ఞాన విజ్ఞానంబులు నీ యుభయ పార్శ్వంబుల దీపంబులు; నాముకుఁజెఱమలయూర్పులు నీ యిరుదెసలంబట్టెడి యాలవట్టంబులు; నా మనోరాగంబులు నీకుఁ జంద్రకావి వలువ నీకు మ్రొక్కనెత్తిన నా చేతులు రెండును మకరతోరణంబులు నా భక్తియె నీకు సింహాసనంబు; నా మేనం బొడమిన పుల

కలు నీకు గుదులుగ్రుచ్చి యర్పించిన పూదండలు; నే నిన్ను నుతియించిన నుతుల యక్షరరవంబులు నీకు భేరీ భాంకార ఘంటానినాదంబులు. నా పుణ్య పరిపాకం బులు నీకు నైవేద్య తాంబూలాదులు; మదీయ నిత్య సేవా సమయ నిరీక్షణంబు నీకు సర్వాంగంబునలందిన తట్టుపునుంగు; నా సాత్త్వికగుణంబు నీకు ధూపపరిమ ళంబు; నీవు దేవదేవుండవు; నే నర్చకుండను. ఈ రీతి నిత్యోత్సవంబు నాయందు నవధరింపవే శ్రీ వేంక టేశ్వరా!

పై వచనమే రాగతాళములతోఁ బాడుట కను కూలమగునట్లు, 'వైరాగ్యవచనమాలికా గీతము'లను పేర ముద్రితమైనది.

శ్రీ వేంకటేశ్వర వచనములు. తాళ్లపాక పెద తిరుమలా చార్య కృతము.

కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము. 1945.

తిరుపతి దేవస్థానమువారిచేఁ బ్రకటితము. ఇందు 166 వచన ములు గలవు.

శంకరకవి క్రీ. శ. 1570 ప్రాంతము

భవానీ మనోహర వచనములు

శైవ వాఙ్మయమున నివి చాలవ్యాప్తిలోనున్న వచనములు. ఇవి నేటికిని కొందఱు పారాయణ చేయు చున్నారు[1]—వీనికి పూర్వము పురాతన శంకరవచన

---

1. భవానీ మనోహర వచనములకే శంకరవచనములని నామాం తరము. ఇవి వేఱు వేఱు గ్రంథములు కావు.

ములని పేరుండెను—శివపంచ స్తవికి వ్యాఖ్య రచించిన దేచనామాత్యుని పుత్రుడు శంకరకవి, మహిమ్నము మొదలగు శివ స్తవములనుండి భావములను గ్రహించి యిందు పొందుపఱచినాడు. ఇవి చక్కని శైలిగలవి—నను రక్షింపవే భవానీ మనోహరా, యను మకుటము గలవి. ఇవి చాల పెద్దవచనములు—మిక్కిలి వ్యాప్తిలో నుండుటచే నుదహరింపలేదు.

### కాశికాధీశ్వర వచనములు

ఇవియును శైవవాఙ్మయమునకు సంబంధించినవే. వీనికి శివయోగ వచనములను నామాంతరము గలదు.

శ్రీ గురుదేవా! అవ్యయంబైన పరబ్రహ్మంబిట్టిదని లోకంబు నెఱుఁగుట దుర్లభం బది సద్గురుప్రసాద లబ్ధంబైన రాజయోగీంద్రుండైన గురుప్రభువుం గలిగిన యది యతిసులభంబుగా సాధకుండైన యోగీశ్వరునకు సిద్ధించు నా రాజయోగంబును, సాంఖ్యంబును, తారకంబును నమనస్కంబునన మూఁడువిధంబులైయుండు... వినోదార్థంబు పాంచభౌతిక దేహంబునుబోలె జగంబున విహరించు పరమశివయోగీంద్రు చరలింగపాదారవిందభజనంబు నాయందు పరంబుగా జేసి రక్షింపవే! శ్రీ కాశికాధీశ్వరా.

## వచనగ్రంథములు

### దత్తాత్రేయయోగి-వేదాంతవ్యవహారసారసంగ్రహము

క్రీ. శ. 1550 ప్రాంతము

మాహురిక్షేత్రమున మహాప్రసిద్ధుడై, దాసగోపాలస్వామి మొదలగు శిష్యులకు జ్ఞానమార్గోపదేశికుడగు దత్తాత్రేయయోగి దీనిని రచియించెను. ఈతడే, పరమానందతీర్థులు. మల్లయోగి మున్నగు తన శిష్యపరంపరమూలమున యద్వైత సిద్ధాంతమును తెనుగున ప్రచారముగావించిన మహనీయుడు. వ్యాసకృతమగు బ్రహ్మసూత్రములకు శంకరకృతమగు శారీరక మీమాంసా భాష్యము ననుసరించి సంగ్రహరూపమున వాడుక తెలుగులో రచియింపబడిన ప్రకరణ గ్రంథ మిది.

"వేదాంతమనగాను శారీరక సూత్రభాష్యము. ఆ శారీరక సూత్రభాష్యార్థము సంగ్రహించిన గ్రంథాలన్నిని వేదాంతప్రకరణాలనంబడును. ఆ శారీరక సూత్రభాష్యానకు యే అనుబంధ చతుష్టయము కలదో అదే వేదాంత సారసంగ్రహమనేటి గ్రంథానకు ఆలోచించేటిదే అనుబంధ చతుష్టయం బనంబడును. అనుబంధ చతుష్టయం బనంగాను అధికారివిషయసంబంధ ప్రయోజనాలును అధికారి అనగాను సాధన చతుష్టయ సంపన్నుం డనంబడును. సాధనచతుష్టయం బనగాను నిత్యానిత్య వస్తువివేకము. ఇహాముత్రార్థ ఫలభోగ

విరాగము, శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వము ఈ నాల్గు సాధన చతుష్టయం బనంబడును ”

ఎల్లకర నృసింహకవి
భారత సావిత్రి క్రీ. శ. 1550

ఈతడు కృష్ణమూర్త్యాచి పుత్రుడు — క్రీ. శ. 1511-1568 వఱకు నున్న ప్రసిద్ధ వైష్ణవాచార్యుడు. తిరుమల లక్ష్మణమునికి శిష్యుడు. ఈతడు మార్కండేయ పురాణమును ద్విపదగా రచించినాడు. ఆ గ్రంథావ తారికలో—

“అనఘాత్మ ఎల్లకరాన్వయాంబోధి
పరిపూర్ణ చంద్రశోభనగుణసాంద్ర
నరసింహకవివర్య నగసమధైర్య
లలిమీఱు తిరుమల లక్ష్మణాచార్యు
చెలగు పాదాంభోజసేవాధురీణ
ప్రచురవాక్యములచే భరతసావిత్రి
రచియించితివి కవిరాజు లౌనన”

భారతసావిత్రి ప్రశస్తమైన వచన రచన గలది. దీనిని స్త్రీలుకూడ పారాయణము చేయుచుందురు. విదురునింటికి కృష్ణుడు వచ్చి విందారగించుట యిందలి కథ.

“కురుక్షేత్రంబు యజ్ఞవేదియు జనార్దనుండు యూపంబును దుర్యోధనుండు పశువును కర్ణుండు

హావిస్సు పాంచాలి యరణియు భీమసేనుం డగ్నియు నర్జునుండు హోతయు భీష్మద్రోణు రాజ్యంబును రణంబు యాగంబు గావించి ధర్మరాజు యజమానుం డును గాండివంబు స్రుక్ స్రువంబులును సమస్త రాజ సంఘంబులు గొనియాడ హోమంబు చేయించె నిది భరతసార సంగ్రహంబున భారతసావిత్రి యనం బరగు![1]

సభాపతి వచనము 1550.

సభాపతులే కాదు చదువుకొనిన సమస్తజనులు గ్రహించి జ్ఞాపకము పెట్టుకొనదగిన గ్రంథము. సమయ స్ఫూర్తి కిందలి విషయములు గుఱుతుపెట్టుకొని యుండుటవలన నెంతో మేలగును. ఇందిరువది ప్రాసలు, ఏబది యతులు చెప్పబడినవి. సభాపతి (రాజు) ఎట్టి వాడుగా నుండవలెను అను వర్ణనతో ప్రారంభమగు చున్నది గాన 'సభాపతి వచనము' అని దీనికి పేరు వచ్చినది. వచన మనుటకు సార్థకముగ మంచి గ్రాంథిక రచనలో నున్నది. రాయవాచకమున నీ గ్రంథము లోని వాక్యము లుదాహృతములగుటచేత, నిది క్రీ. శ. 1550 ప్రాంతమునకు ముంచే రచితమై యుండవలెను. 'మహితసభాభిరామాముఖ కావ్యంబు ధరనిల్వె మీ తాత శరణమంత్రి' అని శేషధర్మములలో క్రీ శ.

1. Descriptive Catalogue of Telugu Manuscripts. Vol 6. Vachanakavyas....D. 1440

1550 ప్రాంతమున తామరపల్లి తిమ్మయ్య మంత్రి చెప్పినాడు. ఈ సభాభిరామకృతియే సభాపతివచనము—అట్లయినను నీ రచనము క్రీ. శ. 1550 ప్రాంతములది కావలెను.

దాసగోస్వామి లేక దాసగోసాయి,

క్రీ. శ. 1560 ప్రాంతము

పరమానంద బోధ ప్రకరణము.

మాహూరి క్షేత్రమున దత్తాత్రేయ మఠమున కధీశ్వరుడై పింగళి సూరన, తరిగొప్పల మల్లన, మల్లారెడ్డి మొదలగు తెలుగుకవులచే ప్రశంసితుడగు దత్తాత్రేయ యోగి మహారాష్ట్రభాషలో నీ గ్రంథమును దాసగోసాయీ అను శిష్యునకు నుపదేశించెను. ఆతడీ గ్రంథమును మహారాష్ట్రభాషలో మొదట వెలువరించి, ఆ వెనుక తెనుగుభాషలో రచించి గోపాలభట్టను తన శిష్యున కుపదేశించెను. ఆతడు సర్వదేవుడను మఱియొక శిష్యున కుపదేశించెను. ఇది వచనరూపమగు వేదాంత గ్రంథము : మచ్చునకు :

"ఆత్మపూర్ణ సమాధినిష్ఠుడైనవానికి జాతీయ విజాతీయ భేదంలేదు. వర్ణాశ్రమాచార ధర్మాలు

1. A note on Mukundaraja the oldest marathi author Bombay Branch of Royal Asiatic Society vol 9 Article VIII Pages 167-170.

చేయబని లేదు. సర్వధర్మాలు విడిచి బ్రహ్మమై, దేశ కాలవస్తువులు లేక, అపరిచ్ఛిన్నమై, జ్ఞానపూర్ణమై పరబ్రహ్మమువలెనే వుండి వాఙ్మనోతీతమై, నామ రూపరహితమై, అఖండ పరిపూర్ణస్వరూపమై యుండును. ఇది సకల వేదాంతసిద్ధాంతం, యోగసాంఖ్య సిద్ధాంతం. బృహదారణ్య సకలోపనిషత్సారం.

'ఇతి దాసగోసాయీ విరచితాయాం పరమా నంద బోధ ప్రకరణం నామ ప్రథమ ప్రకరణం.' అని గద్య కలదు. (సంఖ్య 2125)

సిద్ధరామకవి - క్రీ. శ. 1560

ప్రభుదేవరవాక్యము లేక పిండచక్రనిర్ణయము

"చిత్కళాధామ శ్రీ గురుసిద్ధరామ" అని ప్రాచీనశైవ సమయాచార్యునిగూర్చి శతకము రచించిన సిద్ధరామకవి, యీ శైవ వేదాంతవచన గ్రంథ కర్త- ఇందు ప్రభుదేవర యనగా వీరశైవ మత ప్రతి పాదకులలో నొకడగు నల్లమప్రభువు. ఇతని చరిత్రమే ప్రభులింగలీల యనుపేర, తెనుగున ద్విపద పద్య కృతులలో వెలసినది. ఈ గ్రంథమున, ప్రభుదేవర తత్త్వోపదేశమంతయు తెనుగు వచనముగా వ్యాఖ్యా నింపబడినది. పంచీకరణము పిండోత్పత్తిక్రమము, అను భాగము లన్నియు నిందులోనివే. ఇం దిరువది యేడు భాగములు కలవు. శైలి వ్యావహారికము.

"ముఖ్య వాయువులు చేతుల యెముకలు రెండు, కుదురు యెముకలు రెండు కూడిన దిక్కునుండి దేహ తత్త్వాలనెల్లా వకకడకు తెచ్చును. అంతర్యామి వాయువులు, ఆత్మపురుషునికి వాహనమైయుండి ప్రాణాలు తెప్పించును. ప్రపంచ వాయువు దేహాన కండగా నుండును. వజ్రజడ దేహాన్ని అంచుగా నుండును. అంచు చీలలు చేడితే దేహం చెడును. ఇది పింఢ చక్ర నిర్ణయం." ఈతడు కేదార దేశికుని శిష్యుడు. పిడుపర్తి బసవనను పేర్కొన్నాడు. చూడుడు శతకకవుల చరిత్ర. పుట 300-301. (సం. 2129)

కాశీ చెన్న బసవేశ్వరుడు క్రీ. శ. 1600

వివేకసింధువు

శంకర కృతము గు బ్రహ్మసూత్రభాష్యము ననుసరించి మహారాష్ట్రభాషలో ముకుందయోగి రచించిన, వివేకసింధువను వేదాంతగ్రంథమున కిది తెలుగుసేత. ఈ ముకుందయోగి మహారాష్ట్ర వాఙ్మయమున నాదిరచయిత[1]-ఈతడు, వివేకసింధు వేకాక పరమామృతము, మూలస్తంభము అను మరి రెండు గ్రంథములు రచియించినాడు. ఈతడు పంద్రెండవ శతాబ్ది కడపట నుండెను. కాశీ చెన్నబసవేశ్వరుడు రచించిన యీ తెనుగువచన గ్రంథమే తన రచనము నకు మూలమైనట్లు వివేకసింధువును పద్యకావ్యముగా

రచియించిన వేగినాటి కొండయ్య యిట్లు చెప్పి యున్నాడు.

"వినుతింపం భవరోగవైద్యమగు
నీ వేదాంతశాస్త్రంబు పా
వనమైయుండఁ ప్రవీణతన్ వచన
కావ్యం బొప్పఁగాఁ జేసి స
జ్జనులం బ్రోచిన పుణ్యమూర్తి
విమలస్వాంతుండు విజ్ఞాన శా
సనుఁడైనట్టి ముకుందవర్యునికి
నమస్కారంబు గావించెదన్. 1-12

ప్రస్తుత గ్రంథరచనము ప్రశస్తమైనది. పూర్వార్ధ మే డధ్యాయములు. ఉత్తరార్థము మూడధ్యాయములు కలవు. ప్రారంభము:-

శ్రీమత్పరమేశ్వర భక్తిమార్గానందానుభవ సద్గుణరత్న రత్నాకరంబును, బహువిధరహస్య దురవగాహ మహిమతత్త్వ మహనీయంబును పరమమనీషా విశేషాసాధారణ బోధవిధాన బ్రహ్మజ్ఞాన సాధిత కరతలామలకాయమానంబును, చర్వితచర్వణ దుర్వాహ నిర్వాణ వధూమణీకరగ్రహణానుకూలంబును, శంకరాచార్య ముఖకమల వినిర్గత మకరందరసప్రవాహంబును, నైన వేదభాష్య ప్రకరణంబును సకలకర్మత్యాగియు పరమానందానురాగియు, కైవల్య నిరత భోగియు నైన ముకుందయోగి మహారాష్ట్ర భాషా

విశేషంబున వివేకసింధువుకు రచియించె. నది నక లోపకారంబుగా, సమస్తశిష్యగణ రక్షకుండును, జంగమ శివలింగ విగ్రహుండును, కారుణ్యసము ద్రుండునైన యోగదశాంతసద్గురుకరపద్మ శిరస్సం యోగభావనాసార్థ కృతార్థతనుండునైన కాశీ చెన్న బసవేశ్వరుండను నేను, ఆంధ్రభాషాస్తోకంబుగా టీక రచియింపం బూనితి, సద్వివేక సింధువను జ్ఞానశాస్త్రం బునకు, గురుశిష్య సంవాద టీకావిధానం బెట్టిదనిన; ముకుందరాజయోగీశ్వరుని స్తోత్రం.

పరమానందయతి. క్రీ. శ. 1600

దత్తాత్రేయగురునియొక్క శిష్యపరంపరలో నీత డగ్రగణ్యుడు. వచన వేదాంతవిషయక గ్రంథములనే కాక శతకములను గూడ రచియించియున్నాడు. వచన రచనలలో పేర్కొనదగినది మొదటిది.

[1]వేదాంత వార్తికము

గురుశిష్య సంవాదరూపకమైన యీ వేదాంత వచన గ్రంథము విద్యారణ్యయతి ప్రణీతంబయిన వేదాంత వార్తికమునకు తెనుగుసేత. చక్కని వ్యవ హారశైలిలో నున్నది. చివర పద్యములో—

"పరమానంద యతీంద్రుఁడ
స్థిర దత్తాత్రేయగురుని శిష్యుఁడ, యోగ

స్ఫురణానుభవుండ నీ కృతి
సరసన్ రచియించినాడ సర్వజ్ఞుడనై"

ఇదియే "అశ్రుతార్థోపన్యాసము" అను పేర తెనుగునుండి తమిళభాషలోనికి చిత్ ఘనానందయతి శిష్యుండు సదాశివయోగిచేత మణిప్రవాళశైలిని (తమిళ సంస్కృతములు) ననువదింపంబడినవి. రెండవది బ్రహ్మవిద్యాసుధార్ణవము - 13 ప్రకరణముల మహాగ్రంథము. నూతనముగఁ బ్రకటితమైనది. మూడవది వివేకచింతామణి - నాల్గవది ఉత్తరటీక.

చారిత్రక గ్రంథములు

ఈ యుగమునఁబుట్టిన చారిత్రక గ్రంథములలో 'రాయవాచకము' ప్రధానమైనది. ఇది విశ్వనాథ నాయకుని స్థానాపతిచే రచితమైనది. ఇందు సరళమైన వ్యావహారిక వచనము గలదు. దీని ననుసరించియే కుమార ధూర్జటి కృష్ణరాయ విజయమను ప్రబంధము రచియించియున్నాఁడు. రాయవాచక మాంధ్ర సాహిత్య పరిషత్తువారిచే ముద్రితమైనది.

---

1 లిఖితగ్రంథసూచనలు. అశ్రుతార్థోపన్యాసము (వేదాంత వార్తిక, తమిళ అనువాదము) శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ జర్నల్ పుటలు 136-137 (శ్రీ డి. టి. తాతాచార్య శిరోమణి.)

ఉత్తర ప్రబంధయుగము లేక సంస్థాన పరిపాలక యుగము

గోపినాథకవి క్రీ. శ. 1670

వచనవిచిత్ర రామాయణము

ఇది యుత్కల (ఓఢ్ర) భాషలో సిద్ధేంద్ర యోగి రచియించిన గ్రంథమునకు నాంధ్రానువాదము. ఈ తెనుగు వచనరచన ననుసరించి నల్గురైదుగురు కవులు పద్యకావ్యములుగా రచియించిరి. ఉత్తర ప్రాంతమగు కళింగదేశమున దీని వ్యాప్తి చాలగా గలదు. ఈతడు సృష్టికరణ కులజుడు. క్రీ. శ 1667-1698 సంవత్సరములలో జయపుర సంస్థానమును పాలించిన విశ్వంభరదేవువలన నీతడు సమ్మానింపబడెను. కావున నితడా కాలమువాడు. ఇందలి గద్య:

ఇది శ్రీ సీతారామ వరప్రసాదలబ్ధ కవిత్వ చాతుర్య ధురంధర నిరంతర విద్వజ్జనసాంగత్యబంధుర భారద్వాజగోత్ర పవిత్ర, నారాయణ మంత్రి పుత్ర వితరణ విజత రాధేయ, గోపినాథ నామధేయ ప్రణీతంబైన కేవల వచనవిచిత్ర రామాయణము.

"ఏవం విధ కథావిశేషంబైన వాల్మీకి రామాయణానుమతంబైన యోఢ్ర రామాయణంబును చూచి, తత్కథావిశేషంబుల సారం బంగీకరించి, సంక్షిప్తంబులుగా నెడనెడ సంస్కృతపదంబులు సంఘటించి, తెనుంగు వచనప్రకారంబున రచించితి"అని కలదు.

ఇందు వాల్మీకి రామాయణమున లేని చిత్రకథలు కలిగి బహుమనోహరముగ నుండును. ప్రశస్తరచన గలది.

గణపవరపు వేంకటకవి క్రీ. శ. 1670.

మహాలాక్షణికుఁడును ప్రసిద్ధకవియగు వేంకటకవి తన ప్రబంధ రాజవేంకటేశ్వర విజయవిలాసమున, చూర్ణికలు, వృత్తగంధులు మొదలగు రచనలు గావించి యున్నాఁడు

పుష్పగిరితిమ్మన – క్రీ. శ. 1700. భాగవతసారము.

సమీరకుమారవిజయమను ప్రౌఢ ప్రబంధమును రచియించి, కంకంటి పాపరాజు, తేకుమళ్ల రంగశాయి మొదలగు ప్రసిద్ధ కవులచే స్తుతింపబడిన పుష్పగిరి తిమ్మన భాగవతసారమను వచనగ్రంథము రచియించెను దీని విశేషమేమనగా నీభాగవతసారము తమిళ భాషలోనికి ననువదింపబడినది. తమిళ రచయిత చిన్నయ్యర్ యిట్లు చెప్పినాడు.

"ఇంద పని రెండు స్కందంగళుం విష్ణుప్రియ తెలుంగిలె పుష్పగిరి తిమ్మప్పయర్ యెడిదిన దైపార్ల యవ్వార్ వాద్యార్ చిన్నయర్ తమిళ వచనత్తినాల్ యెడిదినార్"

"సూతుండు శౌనకాది మహామునుల జూచి వింటిరా? మునులారా! ఇటువలె నుత్తరపుత్రుం డడిగితే ప్రత్యుత్తరంబుగా శుకయోగి మహానుభా

2. తెలుగులిఖితగ్రంథముల వివరణ కేటలాగు. వాల్యూం 6. వచనకావ్యములు *D 1437*

వుండు పలికెను. ఓ రాజేంద్రా! నీ వడిగిన ప్రశ్నము మంచిది. ఇది పెద్దలు మెత్తురు వినదగినవి వేయి వేలుం గలవు. వాటిలో నీవడిగినవి ముఖ్యము. సంసార మగ్నులీ తత్త్వము తెలియఁగూడదు; పశు శిశు భార్యాదులమీది మోహము చేత కాలము క్రమించి కడపట చత్తురు[2]."

ప్రబ్రహ్మాండవచనము - మాచనామాత్యుఁడు
క్రీ. శ. 1750 ప్రాంతము.

బ్రహ్మాండ నిర్మాణక్రమము, నాలుగు వేదములు, పదునెనిమిది పురాణములనుండి గ్రహించి, రచితమైన ప్రశస్తవచనగ్రంథము. ఈ మాచన భారద్వాజగోత్రుఁడు. భైరవామాత్యుని పుత్రుఁడు. గ్రంథ చివరగద్యలో "శ్రీ నారాయణ, శ్రీ మహాదేవచరణ ధ్యానానంద" అని చెప్పుకొనుటచేతను, నిట్లే సుప్రసిద్ధ వేదాంత గ్రంథమగు సీతారామాంజనేయ సంవాదమున గద్యలో "శ్రీమన్నారాయణమహాదేవగురు కరుణా కటాక్ష" యని యా గ్రంథకర్త పరశురామ పంతుల లింగమూర్తి కవి చెప్పుటచేతను, మాచనకూడ, యాతని సమకాలికుడని తెలియుచున్నది. ఇది చక్కని గ్రాంధిక శైలిలో నున్నది.

"శ్రీమన్మహాదేవుండు కైలాసశైలోపరి భాగంబునందు సుఖాసీనుండై కూర్చున్న సమయంబున, సకల జగన్మాతయగు పార్వతీదేవి, సాష్టాంగ దండప్రణా

మంబు లాచరించి, లేచి నిలిచి కరకమలంబులు మొగిచి దేవా! సకల జగదుత్పత్తి స్థితి లయ ప్రకారంబులకుం గారణ కర్మలయిన మూర్తిత్రయంబెట్లు కలిగె బ్రహ్మాండ నిర్మాణం బెట్టిది..."
ముగింపు.

"ఈ యాఖ్యానం బెవ్వరయేని తాత్పర్యంబునం బఠించినవారికి సకల దురితక్షయంబును, శాశ్వతసంపదయు, శతాశ్వమేధఫలంబులు గలుగు. ఈప్సితార్థంబులు సమకూరుననిన నా పరమేశ్వరి యానందంబును బొంది సకలలోకములు దయతో రక్షించుచుండె.

సాంఖ్యవిచారము. చెన్నబసవయ్యాకృతము. షడ్దర్శనములలోని సాంఖ్యదర్శనము ననుసరించి, తత్త్వనిర్ణయ మిందు తేటవాడుక తెనుగున వివరింపఁబడినది. ఎడనెడ సాంఖ్యసూత్రములు తదనుగుణములైన యితర గ్రంథములలోని శ్లోకములు నుదాహృతములైనవి. సాంఖ్యదర్శన ముపలక్షణముగా నిందు అద్వైత వేదాంతార్థములు గలవు. (సం. 2257)
సాత్త్వికబ్రహ్మవిద్యావిలాసముకర్త పేరు తెలియదు.

వేదశాస్త్ర ప్రమాణసిద్ధమయిన మతము వైష్ణవమా లేక శైవమా యను విషయము విపులముగాఁ జర్చించుచు వైష్ణవమే సప్రమాణమగు మతమని యీ గ్రంథము సిద్ధాంతీకరించుచున్నది. వైదిక వ్యవహారిక

మగు వచనమున నీగ్రంథ రచన గలదు. దీనిమీద శైవులు సాత్త్విక బ్రహ్మవిద్యావిలాసఖండనమను గ్రంథము రచించిరి.

సాత్త్విక బ్రహ్మ విద్యావిలాస నిరసనము. బుద్ధిరాజు పేరయకవి.-

ముందువివరించిన వైష్ణవగ్రంథమునకు ఖండనముగా నిది వెలసినది. దీని రచియించిన కవి బుద్ధిరాజు పేరయకవి. ఈతఁడు డివటూరి వీరారాధ్యుని శిష్యుఁడు. పినపాటి సర్వదేవారాధ్యుని ప్రేరణచే దీనిని రచియించెను. ఇందుగల యవతారిక పద్యములతో రచితమైనది. తక్కిన గ్రంథమంతయు వచనమే. శైవమతమే సర్వోత్కృష్టమని నిరూపణచేయు మహాగ్రంథమిది. ఇందు శైవగ్రంథము గాన నేకాదశరుద్రుల సంఖ్య ననుసరించి 11 ప్రకరణములు గలవు. ప్రతి ప్రకరణారంభమున పద్యముగలదు. వచనము వ్యావహారికము.

"పురాణకర్త లందఱున్ను బ్రహ్మవలన పూర్వకల్పోక్త పురాణార్థములు తెలిసికొని యీ కల్పమునందయే అతీత కల్పస్థ పురాణార్థములు బ్రహ్మదేవుడేలాగున జెప్పెనో ఆలాగుననే మీరును చేసినారు. పద్మకల్పమునందు మార్కండేయునకు పరమేశ్వరానుగ్రహ కథలు పెక్కైనే అని శంకయొకటి కలదంటే అది సత్యమగును. మార్కండేయుని కథ పద్మ

కల్పమునందు చెప్పియున్నది గనుక అది ఆలాగున నగును."

(దీనినిగూర్చి విపులముగా నా "ఆంధ్రవీరశైవ వాఙ్మయము" అను గ్రంథమునఁ జూడనగును.

అజ్ఞానధ్వాంత చండభాస్కరము.

కంభంపాటి అమరేశ్వరశాస్త్రి ప్రణీతము. ఈతఁడు క్రీ. శ. 1760 ప్రాంతమువాఁడు. ఇది విచార దశకమను పది ప్రకరణములుగల యద్వైత వేదాంత గ్రంథము. చక్కని వ్యావహారికరచనము.

"ఈపరమార్థోపదేశమును నమ్మి నిష్పక్షపాతము చేతను లెస్సగా విచారించుకొందువేని యీ విచారము వలన లభించిన సమ్యక్ ప్రజ్ఞానము వలన తమఃకూర్మమై, రజోమీనమై క్రోధనక్రమయి, కామ వాలమై, జన్మమరణతరంగమయి రోగబుద్బుదమయి, లోభమోహావేలమయి, దుఃఖాగార జల ప్రవాహరూపమయిన యీ సంసార సముద్రమును తరించి మోక్ష పారంపరను పొందెదవు. (R. 194)

1. ముముక్షుజన చంద్రహాసము.
2. పత్రి(?)యానుష్ఠానము.
3. ఆత్మబోధ ప్రకరణము వ్యాఖ్య.

ఇవి మూడును పరశురామ పంతుల బ్రహ్మానందరాజయోగి విరచితములు. ఈత డద్వైత

వేదాంత విద్య సీతారామాంజనేయ మూలమున ప్రచారమునకు దెచ్చిన పరశురామ పంతుల వంశీయుడు కాదగును.

దక్షిణాంధ్ర వాఙ్మయము-వచనరచన.

సలక్షణమగు గ్రాంధిక వచనరచన సమీచీనముగా ప్రారంభమైనది, దక్షిణదేశమున మధుర నాయకుల కాలమునుండి యని చెప్పనొప్పును. ఈదేశమున తంజావూరు, మధుర, ప్రాంతములను తెలుగు నాయకు లేలినను నచ్చటి వ్యవహారభాష తమిళము కాని తెనుగు కాదు. కాబట్టి యా నాయకులతో నచ్చటనే నెలకొనిన తెలుగు రాజకీయోద్యోగులకును, కవులకు, పండితులకు, తక్కినవారికి, మాతృభాష తెనుగైనను నిత్యవ్యవహారమున తమిళభాష తప్పని సరియైనది. అయిన పాలకులు తెలుగువారగుట చేతను, భాషాపోషకులగుట చేతను, తెలుగు భాష యక్షగాన నాటకప్రబంధవచనరూపముల పెంపొందినది. వచనరచనయందు మాత్రము ప్రత్యేక లక్షణ మొకటి ప్రభవింప జేసినది. ఇతరాంధ్ర దేశమునందువలె, నిచ్చట తెనుగున వ్యావహారికముగను, గ్రాంధికముగను వచనరచన రెండువిధములుగా వర్థిల్లుటకు వీలు కలుగలేదు. ప్రజాసామాన్య వ్యవహార భాష తెనుగు కాకపోవుటచే, శుద్ధమగు గ్రాంధికరచనములోనే వాఙ్మయము వర్థిల్లినది.

ధేనుమాహాత్మ్యము.

ఈ వాఙ్మయశాఖలో మొదట వెలువడినది లింగనమఖి శ్రీ కామేశ్వరకవి ధేనుమాహాత్మ్యము లేక ఆవుల మాహాత్మ్యము అనునది. ఈతడు రుక్మిణీ పరిణయము, సత్యభామాసాంత్వనము[1] అను రెండు ప్రబంధములను రచించెను. వానిలో 'సత్యభామా సాంత్వనము,' శృంగారప్రబంధములలో నొక రసవత్ప్రబంధముగా నెన్నిక గన్నది. క్రీ. శ. 1674 సంవత్సరమున తంజావూరిని జయించి పాలించిన ముద్దళగిరియొద్ద నీత డాస్థానకవిగా నుండెను. ఇందలి శైలి చక్కనిది.

"ఆవుపా లమృతంబని అమరవిభుండు పలుకరించెగనుక, ఆవు నిచ్చిన అమృత మిచ్చిన ఫలము చేకూరును. మేపుతోగూడ మేలైన దూడ ఆవును వృషభమ్మును నెవ్వండొసంగు నతండు స్వర్గంబునందు సుఖంబుజెందు. ప్రాణంబులు, ధేనువులు, సమంబులని మునులు పలుకరింతురు. కాబట్టి గోదానంబుచేయు జనులకు ప్రాణదానఫలంబు కలుగును......కావున నావుల మహిమ నెన్న నలవిగాదు."

విజయరంగ చొక్కనాథుడు క్రీ. శ. 1704-1731

శ్రీకృష్ణదేవరాయల కాలమున ప్రబంధములు వర్ధిల్లినట్లు విజయరంగ చొక్కనాథునికాలమున వచన

1. ఈ గ్రంథము బందరులోని శృంగార గ్రంథమండలియందు నాచే సంస్కరించబడి విపుల పీఠికతో వెలువడినది.

ములు వెలసినవి. ఈతడు స్వయముగ, వచనగ్రంథ
ములు రచియించుటయేగాక, వచనరచయితల నాద
రించిన విద్వత్ప్రభువు - ఈతని గ్రంథములు రెండు
లభ్యములైనవి. రెండును నముద్రితములు—

శ్రీరంగమాహాత్మ్యము :

ఇది శ్రీరంగ క్షేత్రమాహాత్మ్యమును దెలుపు పది యధ్యాయముల గ్రంథము - శ్రీరంగనాథుని కంకితము. ఇందలి వచనశైలి తెలియుటకు కొన్ని పంక్తు లుదాహరించెదను.

"శ్రీరంగ విమానరాజంబు తొలుదొలుత బ్రహ్మలోకంబున నుండు. తదనంతరంబు నీవు తపంబు చేసిన జతుర్ముఖుండు నీ కీయంగలండు. అయోధ్యా నగరంబున నీవు నీవలన జనించిన రాజులును పెక్కండ్రు పూజింపగలరు. అంతట మురాంతకుండు రామ నామధేయంబున భవదీయవంశజాతుండైన దశ రథుని గర్భంబునం దవతరించి, లోకవిద్రావణుండైన రావణుని సంహరించి వానికి సహోదరుండును బ్రియం కరుండును నగు విభీషణునకు లంకారాజ్యంబును నీకు గుల ధనంబగు శ్రీరంగవిమానంబు నీయ గలండు."

మాఘమాహాత్మ్యము :

ఇది పదిహేనధ్యాయముల గ్రంథము. ఈ గ్రంథము మొదట,

"శ్రీమచ్చంద్రసరోవర తామరస
పరాగ చారు తరపటవాసా
కామాదివినుత జగదభిరామామృత
గుణ విలాస రంగనివాసా !

అను కంద పద్యము గలదు. దీనివలన సీతనికి కవితారచనకూడ తెలియును. మాఘమాహాత్మ్యమును దెలుపున దీ కృతి - మచ్చునకు. "మృగశృంగ మహాముని మాఘస్నానఫలంబు ధారవోయుటచే ధర్మగుప్తుడు గజరూపవిముక్తుడై చెప్పినమాటలు : బ్రహ్మ తేజోనిధీ ! నాయేనుగుజన్మంబు తొలంగె. నిషధపురంబున విశ్వగుప్తుండను వైశ్యుండు స్వధర్మంబు తప్పకయుండు. నే నతని కుమారుండ. వేదంబులు చదివి యాగాది కర్మంబులు సేయుచు జాతికిం దగిన జీవనంబున మెలంగుచు, ధర్మంబుగా వడ్డి కిచ్చుటయు, నావుల బాలించుటయు, పైరులు పెట్టించుటయు మొదలైన వైశ్యకర్మంబులు సేయుదు."

సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు.

ఈతడు విజయరంగ చొక్కనాథుని ముఖ్య సామాజికులలో నొకడైయుండెను గాన నాతని సమకాలికుడు - ఈతడు జైమినీ - భారతము, సారంగధర చరిత్రము అను రెండు వచనకావ్యములు రచియించెను. ఈ రెండు గద్యకృతులే గాక, అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము అను రెండు శృంగార

ప్రబంధములు రచించెను. అందులో మొదటి దీవఱకే చాల వ్యాప్తిలోనున్నది. వచన రచనలలో మొదటిది,

జైమినీ భారతము.

ఇది పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినీభారత పద్యకృతికి వచనానువాదము - అయిదాశ్వాసముల కృతి - ఇది విజయరంగ చొక్కనాథుని కృతి - ప్రతి యాశ్వాసాద్యంతంబులయందు ప్రబంధములవలె, పద్యములు గలవు. ఇందు పినవీరన్న పదములు జాతీయములు, సమాసములు, వాక్యములు, సామెతలు-నన్నె వాడినను, సంస్కృతమున జైమిని భారతాశ్వమేధ పర్వమును చూచినట్లు గ్రంథాంత గద్యలు తెలుపుచున్నవి. కాని శృంగార వర్ణనలయందు, యుద్ధవర్ణనలయందు రెండింటిని మీఱి యథేచ్ఛముగా వర్ణనలంగావించెను. ఇందలి శైలి చిన్నయసూరి ప్రౌఢశైలికేమాత్రమును తీసిపోదు. ప్రాచీనరీతి ననుసరించిన నిప్పటి వానితో బరిశీలించిన నీ క్రింది భేదంబులు కనఁబట్టును.

1. పాత్రలకు సర్వనామము లుపయోగింపక నామములే వాడుట.

2. యమకానుప్రాసాద్యలంకారములకొఱకు వర్ణన కల్పించుట.

3. గ్రంథమున నఱసున్నలే వాడుట.

ఈ గ్రంథము ముద్రితమై ప్రచారమున నుండు టచే వాక్యము లుదాహరింపలేదు.

సారంగధర చరిత్ర.

జనరంజకమగు సారంగధరచరిత్ర మూడా శ్వాసముల వచనముగా రచితమైనది. ఇది శ్రీరంగే శున కంకితము. ఆశ్వాసాద్యంతంబుల పద్యములు కలవు. శైలి రసవంతమైనది.

"అప్పుడు ప్రోడలగు చేడియలా చేడియం జూచి యి కుమారుని చక్కదనంబును, నీ చక్కరబొమ్మ యక్కరయుం జూచిన నేటి కివ్వేటికే మోపాటు వచ్చు నని తోచుచున్నది. ఇత్తరి యిబ్బిత్తరి కింత తత్తరం బేటికి? సూటిగానివోట మోహంబు పాటించుట పాటిగాదు. ఈ వనితను మనము మానుపలేము. దైవ గతి విపరీతంబయ్యెనని తోచుచున్నది."

కుందుర్తి వేంకటాచలకవి.

ఇతడును విజయరంగ చొక్కనాయకుని యా స్థాని. మిత్రవిందాపరిణయమను నీతని పద్యకృతి చాల కాలముక్రిందట ముద్రితమైనది. కార్తికమాహాత్మ్యము అను నితని పద్యకృతి యింకను నచ్చుకాలేదు. మిత్ర విందాపరిణయములో విజయరంగ చొక్కనాథుడు తన్నుగూర్చి చెప్పునపుడు—

"రచియించినావేమి వచనకావ్యములు. రామా యణ భారతకృతులు" అని ప్రశంసించుటచే నీతడు

భారత రామాయణములు వచనకావ్యములుగా రచియించుట నిశ్చయము. కాని యవి నేడు కానరాలేదు.

శ్యామరాయ కవి.

ఈతడు రామాయణవచనమును రచియించెను. విజయరంగ చొక్కనాధుని కాలమున, మధురలో నున్న తుమ్మలపాటి సుబ్బరాయశెట్టి యను వైశ్యునకు కృతి నిచ్చియున్నాడు. ఈతడు ములికినాటి బ్రాహ్మణుడు - అశ్వలాయనసూత్రుడు, వసిష్ఠ గోత్రుడు. కృష్ణయామాత్యపుత్రుడు. షడ్దర్శనీపారంగతుడు. అసహాయకవి బిరుదాంకితుడు. ఇందు బాల అయోధ్య, అరణ్యకాండములు లభ్యమగుచున్నవి. అరణ్యకాండమున సర్గల ననుసరించి వ్రాసినాడు. అవతారికా పద్యములు ప్రతిసర్గాదిని విషయసూచిక కలదు. ప్రసన్నమైన రచనగలది.

"ఓపురుషపుంగవా! నీ వుత్సాహసంపన్నుండవగుచు నన్నుం గరుణింపుము. నీ వంటివల్లభుం డుండియు నేన నాథ తెఱంగున నున్నదాన భూత కారుణ్యంబు పరమధర్మంబని పూర్వంబున నీ వలననే వినియుందును. నీవు మహావీరుండవనియుఁ మహాబల సమన్వితుండవనియు మహోత్సాహుండవనియు నెవ్వరికింగాని కార్యంబు నీకు శక్యంబనియు నెఱుంగుదు" రఘుపుంగవా! ఈ రాక్షసులయందొక్క యస్త్రం బేమిటికి ప్రయోగింపవు. అంత శౌర్యసమగ్రుండగు

మహాబాహులందు నన్ను మఱవనివాడయ్యేనేని శితశరంబుల నీరాక్షసుల నేమిటికి సంహరింపడు."

శ్రీపతి రామభద్రకవి.

ఈతడును విజయరంగ చొక్కనాథుని కాలము వాడే. హాలాస్యమాహాత్మ్యము అనువచన కావ్యము రచియించినాడు. ఇది నంజరాజకృతికంటె వేఱైనది. దానికన్న ముందు వెలసినది. ఈతడు ఆశ్వలాయన సూత్రుడు. కాశ్యపగోత్రుడు. గిరియమ సూరయ లీతని తలిదండ్రులు. మీనాక్షీ సుందరేశ్వరలబ్ధకవితా మాధురీ సంపన్నుడు. సంస్కృతపదజటిలమై, ఉభయ భాషలయందు యమకముతో గూడిన ప్రశస్తరచన—

దేవకి వేంకటసుబ్బకవి రామాయణవచనము.

ఇతడు మధురనాయకుల కాలములోని వచన రచయిత. ఈతని రామాయణ రచనలలో, ఆరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలు మాత్రమే లభ్యమైనవి. ఈతడు భారద్వాజగోత్రుడు అళగరయ్య పుత్రుడు-మధురానగరనివాసి. ఇది సంస్కృత రామాయణమునకు సరియగు తెనుగని, యందు వరుసగా నీయబడిన, యాధ్యాయసూచనవలన దెలియుచున్నది. శైలికి కొన్ని పంక్తులు :

"మహాత్మా! నీ కతంబున మదీయంబగు శాపంబు నిర్ముక్తంబయ్యె. నే నింద్రలోకంబునకు బోయెద. ఇంకొక్కవార్త నెఱింగించెద వినుము.

ని నీన్న సరోవరమునకుం బొమ్మని యనిపిన తపసి వృత్తాంతము నీకు దెలిపెద. వాడొక్క రాక్షసుండు ఛలంబున రాక్షసనాయకుండగు రావణుని నియోగంబున బలీయుండై నిన్ను జంపుటకు బూనివచ్చె." ఇది యముద్రితము.

వేదాంతసారసంగ్రహము.

వెలగపూడి కృష్ణయామాత్యుడు రచించిన యీ వచనకృతి నేడు కానరాకున్నది. ఈతడు భానుమ ద్విజయ మను ప్రశస్త ప్రబంధమును రచించి, విజయ రంగ చొక్కనాధుని కాలములో నున్నవాడు.

గజారణ్యక్షేత్ర మాహాత్మ్యము - పాంశవాశ్వమేధ వృత్తాంతము.

ఈ రెండును, విజయరంగ చొక్కనాధుని కాలములో బుట్టినవి. కాని కర్తృత్వము తెలియరాలేదు. మంచి వచనరచన గలవి.

ఉత్తరగోపురకథ పట్టుగొడుగుల వచనము :
క్రీ. శ. 1700 ప్రాంతము.

ఇందలి కథ రామాయణమునందలి యుద్ధకాండ భాగము. రావణుడు లంకయుత్తరగోపుర మధిరోహించి, వానరసేనతో సువేలాచలమునకు వచ్చిన శ్రీరాముని సైన్యమును చూచి, అనుతాపము చెందు ఘట్టమిందు వర్ణితము - దీనికే "గొడుగుల వచనము" అను నామాంతరము గలదు. ప్రాచ్యలిఖితపుస్తకశాల

గ్రంథవివరణములో[1] నీ, 'గొడుగుల వచనమునకు నర్థమో మో' అని వ్రాయబడియున్నది. దీనియర్థమును సంప్రదాయము నిది.

పావులూరి మల్లన గణితములో సూత్రవ్యవహారములో—

'ఉత్తరగోపురం బాగి రావణుం డెక్కి
పట్టిన గొడుగులు భానుగప్పె
అవి సహింపక రాము డమ్మొక్క టరిబోసి
గొడుగులన్నియు ద్రుంచె గుత్తికలకు
అందు మూడవపాలు అబ్ధిపై గప్పెను
నాల్గవపాల్ వోయి నగముగప్పె
నగచరావళి గప్పె నాఱవభాగంబు
అష్టభాగము గప్పె నసురవీడు
నవమభాగము గప్పెనంతః పురంబు
మూలమును చెడిరెండును మోలబడియె
తెగిన గొడుగులెన్ని తెలియంగ జెప్పుడా
గణితమెఱిగి రేని క్రమముగాను.'

'ఋతుగణములు వలనిడుకొని
గతులను గుణియింపనదియ గలిగిన ఫలముల్
అతికీర్తిని బౌలస్త్యుని
సుతు గొడుగులు తెగిన సంఖ్య సూటిగ వచ్చున్.'

1 వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్ర 3 వ భాగము పుట. 92,93.

పూర్వము ప్రజాసామాన్యమున మల్లన గణి తమే వాడుకలోనుండుటచేతను రామాయణకథయం దీభాగమును మల్లన యుదాహరణగా నిచ్చి యుండుట చేతను, ఉత్తరగోపురకథపట్టునకు 'గొడుగుల వచనము' అని పేరువచ్చినది. ఇది మంచి రచనగలది. అముద్రితము. కుందుర్తి వేంకటాచలకవి రచిత వచన రామాయణభాగములోనిది కాదగును - శైలికి :

'రావణు డతని గోపించి యిట్లనియె. మున్ను శుకసారణులు రామగుణపరాక్రమంబులు చెప్పిన తెలియనైతి. అతడే ధర్మి, ఆతడే ఆదిమూర్తి, ఆతడే సత్యసంధుడని నేను నిక్కము బెఱింగితి. ఆతడే సర్వ లోకరక్షకుడు - ఆతడే సర్వజీవదయా పరమూర్తి.

కళువె వీరరాజు క్రీ. శ. 1730.

మధురనాయకుల వెనుక మైసూరిలోని సామంత రాజులు సైన్యాధిపతులునగు, కళువెవంశీయులు వచన రచన పెంపొందించిరి. వీరిలో వీరరాజు క్రీ. శ. 1704-1731 వరకు మైసూరును పాలించిన ప్రసిద్ధరాజకవి చిక్కదేవరాయలకాలమున విలసిల్లెను భాషాపోష కుడు. ఈతడు మహాభారతము వచనకావ్యముగా రచియించెను. అందులో, ఆదిపర్వము, సభాపర్వము, భీష్మపర్వము మాత్రమే చిక్కుచున్నవి. సభాభీష్మ పర్వములు ముద్రితములైనవి. ఈ రచన క్రీ. శ. 1730 సంవత్సరమున నైనట్లుగ గ్రంథాంతపద్యము తెల్పు చున్నది.

కళువై నంజరాజు క్రీ. శ. 1760 ప్రాంతము.

వీరరాజు కుమారుడు నంజరాజు సంస్కృతాంధ్రకర్ణాట భాషాకవితావిశారదుడు. కవిపండితపోషకుడు - సంస్కృతమున, నంజరాజ యశోభూషణమను నలంకారశాస్త్ర మీతని పేర వెలసినది తెనుగు భాషలో నీతని వచనరచనలు రెండు కానవచ్చుచున్నవి.

నంజరాజచరిత్రము నంజయశోభూషణమున నాటకప్రకరణమునకు వచనము ఆలూరి నరసింహు కవిత్వము. (R 731)

హాలాస్యమాహాత్మ్యము.

దక్షిణ మధురాక్షేత్రమాహాత్మ్యమును దెలుపు డెబ్బది యధ్యాయముల గ్రంథము - ఇందు సుందరేశ్వరుని లీలలు 64 ను వర్ణితములైన మంచి రచన - అముద్రితము. ఈవఱకు కవుల చరిత్ర[1] మూలమున పరిచితమైనదే ఇందలి వచనరీతి:—

'రూపలావణ్యభాగ్యమువల్లనో యనుపైన గోత్రంబు గలవాడనియో విద్యం జూచియో, సుందరేశ్వరుండను బుద్ధిచేతనో, లేక భ్రాంతిచేతనో నేడు నేను బిడ్డ నిచ్చుట యనుచుం బలికి యా బ్రహ్మచారిం గుఱిగోత్రంబు లడుగ నతండు తన గోత్రంబును, సూత్రంబును, నక్షత్రంబును నూర్ధ్వపుండ్రంబును గ్రమంబుగా విస్మితుండై యెఱింగించుటయు నబ్బాంధ

వృత్తి కులగోత్ర వ్యత్యాసంబులు లేకుండుటకు సమ్మతించిరి.'

కాశీమహిమార్థ దర్పణము.

ఇది స్కాందపురాణమున కాశీఖండమునకు వచనరూపమగు నాంధ్రీకరణము - ఇది కర్ణాట భాషలో తొలుత రచితమై యా వెనుక తెనుగులోని కనువదింపబడినది. సంస్కృతమూలము ననుసరించి నదే గాని శ్రీనాథుని కాశీఖండరచనతో సంబంధము లేదు.

'ఒకానొక కాశీపట్టణము భూమియందున్నదైనాగానీ, అక్కడ వాసం చేసుకొని ఉండేవారికి పునర్భవాదులు లేవు గనుక తాను భూమిగదా, అయినాగానీ స్వర్గమందుండేవారికి పునరావృత్తి గలదు; తన యందుండేవారికి పునరావృత్తి లేదు గనుక తాను స్వర్గమునకంటె క్రిందుగా ఉండేటిదయినా మీదనైననుగాని తాను కోటకొత్తళములచేత కట్టబడినదైనా భవబంధములను విడిపించును.' (R757)

తుపాకుల అనంత భూపాలుడు.

చంద్రగిరి కృష్ణరాజు పుత్రుడైన అనంతభూపాలుడు ప్రసిద్ధ వచనరచయిత. ఈతని కృతులు 1. విష్ణుపురాణము 2. భగవద్గీతలు 3. రామాయణ వచనము (సుందరకాండముమాత్రము.) 4. భారత

వచనము సభాపర్వ, భీష్మపర్వములు - ఈ కడపటి గ్రంథమున నితడు, కళువె వీరరాజునకు సహాయుడైన ట్లా గ్రంథమునందలి గద్యలలో నగుపడుచున్నది. అనంతభూపాలుడు తన గద్యలో "నిఖిలపురాణేతిహాస కథానుసంధాన సమేధమానచాతుర్య వచనరచన వైచక్షణ్య" అని చెప్పకొనినాడు. ఇది యతిశయోక్తి కాదనుట కాతని వచనరచనానైపుణ్యమే తెలుపును. ఆయా గ్రంథములనుండి మచ్చున కుదాహరించెదను.

విష్ణు పు రా ణ ము.

"కలియుగంబున వర్ణాశ్రమధర్మంబు లర్థకామ ప్రధానంబులై యాచరింపంబడుంగాని ఋగ్యజుస్సామ వేదమార్గంబున బ్రవర్తిల్లవు. న్యాయప్రాప్తంబులగు వివాహంబులును, ధర్మమర్యాదాకలితంబులగు గురుశిష్యభావంబులును, దాంపత్యధర్మంబులు, నగ్ని సంతర్పణంబులును దేవపూజా విధానంబులును గలియుగంబునం గలుగ నేరవు." ఇది ముద్రితమైనది.

భ గ వ ద్గీ త.

ఈ భగవద్గీత ప్రశస్తమైన రచన గలది. పాఠశాలలో నిత్యపఠనీయ గ్రంథముగా నుండదగినది. ముద్రితమయ్యును ప్రచారమున లేకపోవుట, వచన రచనయందు మనకు గల వైలక్షణ్యము వ్యక్తమగుచున్నది. "నేను సర్వభూతములకు సమానుండను నాకు ప్రియుండును ద్వేషియును లేడు. అయినను

నన్నెవరు భజింపుదురో వారలు సంతతంబును నా యందు ధ్యానము గలిగియుందురు. నేను వారల నను గ్రహింపుదు. అత్యంత దురాచారుండైనను, నాయందు భక్తిసేయు నతండు, పాపవిముక్తుండై శీఘ్రంబున ధర్మపరుండై శాశ్వతంబైన మోక్షంబు నందు."

రామాయణము : సుందరకాండము.

ఇది యైదాశ్వాసముల గ్రంథము-అముద్రితము.

"ఓ పురుషపుంగవా ! నీ వుత్సాహ సంపన్నుడవగుచు నన్ను గరుణింపుము. నీవంటి వల్లభు డుండియు నే ననాథ తెఱంగున నున్నదాన - భూ కారుణ్యంబు పరమధర్మంబని పూర్వంబున నీవలననే వినియుందును. నీవు మహావీరుండవనియు, మహోత్సాహుండవనియు, మహాబలసమన్వితుండవనియు నెవ్వరికింగాని కార్యంబు నీకు శక్యంబనియు నెఱుంగుదు,"

ఆంగ్లేయ రాజ్యారంభము [1]కుంపిణీకాలము - మొదటిదశ. మెకంజీయుగము.

తెనుగు వచనము - క్రైస్తవ మతగ్రంథములు.

తెనుగువచనముగూర్చి తెలిసికొనదలచినపుడు క్రైస్తవ వాఙ్మయమును గూర్చి తెలియుట యావశ్యకము - తెనుగుభాషలో మొట్టమొదట ముద్రణ

1 నేడు మనము (కంపెనీ) అనివాడు నాంగ్లభాషాపదమును "కుంపిణీ, లేక కుంఫిణీ" అనియే వాడవలయు నని యది సరియైనదని కీర్తిశేషులు బ్రౌనుదొరవారు తమ నిఘంటువున వ్రాసియున్నారు

మతధర్మములను వాడుకభాషలో రచించి శీఘ్ర వ్యాప్తికై వానిని యచ్చువేయింప నారంభించిరి. వారి యభిప్రాయము ననుసరించి, గ్రంథ ముద్రణము వారి మతవ్యాప్తికే యుపయోగపడినను కాలక్రమమున నా ముద్రణసాధనము, తెనుగున సారస్వతాభ్యుదయము నకు మహత్తర సాధనముగా పరిణామము చెందినది. ఆ రచన మంతయు వచనమే యైనను, అది యీనాటికి వాఙ్మయ వ్యవస్థనందక, నొక కృత్రిమపుగు రచనయై, 'బైబిలు తెలుగుగా నుపాదేయము' కాకపోయినది. దీనికి కారణము లివి. ఈ క్రైస్తవ గ్రంథములు వచన రచనలలో కాలక్రమము ననుసరించి మొదట,

(1) కేవలము వాడుకభాష వచ్చెను. (2) పిమ్మట సులభగ్రాంథికముగ గ్రంథములు వెలువడినవి. (3) వాడుకభాషను కృత్రిమము చేసిన వచనరచన మూడవదశ.

క్రీ. శ. 1720—1802 - వ్యవహారిక భాషా రచనము. క్రీ. శ. 1802—1860 - సులభగ్రాంథిక రచనము క్రీ. శ. 1860 - నవీన కృత్రిమ రచనము అని దీనిని విభజింపవచ్చును.

క్రీ. శ. 1720. క్రైస్తవపురాణ కథాసంక్షేపము.

జేసునాథుడు పాస్కపండుగ పోడువునా యెన్మిది దివసాల పరియంత్తం జెరుసలేమున వుండి చాలా అద్భుతాలను చేసినందువల్ల అనేకులు అతని

పడ్డెరి. అయినాగాని అతడు వార్ల చెపలబుద్ధి నిమిత్తం వార్లను నమ్మరు. ఇదిగో వకరు తెలపకనే అనంత జ్ఞానోదయులైనవారు మానవులయొక్క అంతర్భావ యింగితములను లెస్స యెరిగివుందురు. కనుక తమ్మి విశ్వాసించిన కొందరి మనస్సు అస్థిరమున్ను కొందరి విషమమర్మ మచ్చర్యమున్ను జూచి అతడు వుత్సవం దీరే దిన్ని వార్లను బాసి బైణమై తర్లినారు.

నెం. 1412.

"పరలోక భూలోకం శ్రిష్టికర్తలైనవారు నిర్మించిన విధం యిజురేల్ అనే టప్పువంటివారుల వేద మందు రాశివున్నది సంక్షేపమూ మొదటి భాంకం శ్రిష్టింపు - ప్రథమ విశేషము."

ఇది కొంత క్లుప్తీకరించబడ్డది. అంత ఉదాత్తమైన శైలిలో లేకపోయినను, స్పష్టమైన, తేట తెనుగు భాషలో నున్నది. ఆర్. సి. మిషన్ వారు ఈ అనువాదమును 1720 ప్రాంతముల ప్రచురించిరి.

తెలుగుభాషయందు ముద్రణకళ పాశ్చాత్యుల వలన క్రైస్తవ మతవ్యాపనముకొఱకు పెంపొందింపబడినది. ఈ మతగ్రంథములను తెలుగున మొదట బెంజమినుషూల్జి (Benjamin schultze) అను నతడు రచియించెను. ఈ గ్రంథ ముద్రణము క్రీ. శ. 1746 నుండి ప్రారంభమగుటచేతను, నంతకుమున్ను తెలు

గున ముద్రణ లేకపోవుటచేత నిదియే మొదలని చెప్ప వచ్చును.

షూల్జి రచించినవి.

(1) సత్యమైన వేదంలో వుండె జ్ఞానవుపదేశాల యొక్క సంక్షేపం. (Catechism) 1746

(2) మోక్షానికి కొంచ్చుపొయ్యే దోవ (Way) 1746

(3) బుద్ధికలిగిన నూరు జ్ఞానవచనాలయొక్క చిన్న పుస్తకం (Rules). 1747

(4) ఒక గురువు అఇదు బ్రాహ్మలయొక్క... పెద్దస్వామి మీాద ప్రసంగించిన తర్కమితె (Colloq-uuem) 1747

(5) దేవునియొక్క సమస్తమైన వాక్యము సువిశేషము...మమ్మును రక్షించ్చేకర్త అయిన యేసు క్రీస్తుయొక్క శుభసమాచారము.

మార్కు, మత్తయి, లూకా, సువార్తలు గ్రీకుభాషనుండి జిక్రాక్, ఆనందరాయర్ గార్ల సహాయముతో, ఎ. డి. గ్రాంజెస్‌గారు అనువాదించినది. శ్రీరామపురములో 1812.

(2) యీా గ్రంథము యేసుక్రీస్తుయొక్క నూతన నిర్ణయమై యున్నది.[1]

ఏసుప్రభువు, రక్షకుని, నూతన నిబంధన, గ్రీకు భాషనుండి, ఆనందరాయరుగారి సహాయముతో ఎడ్వర్డుప్రిచ్చెట్ గారిచే తెలుగులోకి అనువదింపబడినది. 2 వాల్యూములు-1818.

పై రెండు క్రైస్తవ గ్రంథములను తెనుగు వచనముగ రచియించిన ఆనందరాయడు మంగళగిరి ఆనందకవి. ఈతడీ వచన గ్రంథము నేగాక, వేదాంత రసాయనమను పద్యకావ్యమును రచియించినాడు. ఇది యేసుక్రీస్తు చరిత్రను తెలుపు నాల్గాశ్వాసముల ప్రశస్త కృతి. టీకాతాత్పర్యములతో 1882 లో ముద్రితమైనది. బ్రౌనుదొరవారీ గ్రంథమునుగూర్చి 1840లో The madras journal of literature and science అను పత్రికలో వ్రాసియున్నారు. విజయనందన విలాసము అనునది యీతని మఱియొక పద్యకృతి. ఈతడే స్థానికచరిత్రలకు మూలపురుషుడగు కర్నలు మెకంజీదొరవారివల్ల నియమితుడై, అమరావతీ స్తూపమును మొదట పరిశోధించిన శాసనములకు ప్రతులు వ్రాసినవాడు. ఈతని దినచర్యనే 'Dairy of Ananda Rao' అని యందురు. ఈతని దినచర్యలో, అమరావతిప్రాంతమున దొరకిన రత్నములను, మెకంజీ దొరవారి ప్రతినిధియగు కావలి లక్ష్మయ్యగారికి పంపినట్లు కలదు. (Tylor Vol III Page 505)

క్రీ. శ. 1818.

ఈశ్వరుని అన్నిమాటలు విశేషముగా మనుష్యుని ఉద్ధారము కొరకు ఆచరించేటందుకుకొరకున్ను దేనిప్రకాశము చెనున్నాడో ఇదె ధర్మ పుస్తకము— దాని అంత్యభాగము. అర్థము మాకు ప్రభుడు ఉద్ధరించేవాడున్నైన యిశుక్రిష్టుని మంగళసమాచారము.

గ్రీకభాష వల్లనుంచి తర్జుమాయను

శ్రీరామపురములో పడెచ్చు ఆయాను. 960 పుటలు.

తెలింగ 1818

"యిశు క్రిష్టునియొక్క పుట్టడము యీలాగు నాయెను. అతనియొక్క తల్లి మారియా యాయుసఫుని కొరకు వాక్యదత్తమైదాకుంచున్న వారి యొక్క కలుసుకోవడముకంట్టె ముందుగా ధర్మాత్ముని • త కడుపుతో ఉన్నష్ఠువంట్టి దాయెను! దానియొక్క పెనిమిటి యాసఫుడు యాథార్థికుడైన వాడన్నుకుంచున్న ప్రకాశంగాను కళంకం కాదాన్నిగాను చెయించేటందుకొరకు ఇచ్ఛఇంచక దాన్ని గుప్తరూపము చేత విడిచిపెట్టటందుకొరకు తలిచెను। మరియేమంటె వాడు ఈ ప్రకారంగా చింత చేస్తూఉండగా చూడు ఈశ్వరుని దూత స్వప్నమందు వానికొఅకు దర్శదమును ఇచ్చెను।

వాక్య విరామ చిహ్నములు "।" యిట్టి గీతతో చూపబడినవి.

రెండవపడిశె – బ్రౌనుయుగము. (క్రీ. శ. 1857)

క్రీ. శ. 1840. జ్ఞానబోధము.

ఈ క్రైస్తవ మతగ్రంథము తమిళమునుండి భాషాంతరీకరణము. ఇది బైబిలునకు తెలుగు కాదని క్రైస్తవమతము నీతినిగుఱించి చెప్పెడి వచనరచన యని భాషోద్ధారకులు బ్రౌను దొరవారు తే 3-8-1840 దిని వ్రాసియున్నారు; శైలి యిట్లున్నది:—

“పాపము యొక్కమర్లు విడుదలిస్తే ముందర ముందర తన్ను తాను తాను తెలియవలెను - తన్ను తాను తెలిస్తే తన్ను కలిగించిన సర్వేశ్వరుని తెలియ వచ్చును - వారిని తెలిసి, వారినుండి ఆత్మునకు కావలసిన మోక్షభాగ్యం పొందవచ్చును...మనుష్యుడు తన ఆత్మయొక్క జ్ఞాన జననమును దివ్యలక్షణ మహిమయున్నా తెలిస్తే చెడిపొయ్యే భూలోకం వర్జించి నాశనములేని మోక్షరాజ్యంలో సర్వేశ్వరునితో వర్ధిల్లియుండ మనస్సునుంచక యుందునా?”

(సంఖ్య. 2098)

కథావాఙ్మయము.

ఈ కాలమునకు కొంచెము ముందుగనే యాంగ్లేయు లిక్కడ స్థిరపడుటయు, యాంగ్లవిద్య ప్రవేశ పెట్టుటయు, కళాశాలలు ముద్రాక్షరశాల లేర్పాటు చేయుటయు జరిగినది. తెనుగు భాషకూడ రాజకీయోద్యోగులగు నాంగ్లేయులు నేర్వవలసివచ్చుటచేత, వారి

కొఱకు వచనగ్రంథము లావశ్యకము లయ్యెను. అవి సులభగ్రాహ్యముగ నుండుట తప్పనిసరి యైనది. అవి యాకర్షణీయముగ నుండునను తలంపున, కథారూపముగ మొదట రచన వెలిసినది.

ఈ వాఙ్మయమున తొలుత పేర్కొనదగినవి.

1. విక్రమార్కుని కథలు 1819.

2. పంచతంత్ర కథలు 1834.

ఇవి రెండును, ఫోర్టు సెంటుజార్జి కళాశాలలో నాంధ్ర ప్రధానోపాధ్యాయుడగు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారిచే (1770 1837) రచితమైనది. తెనుగువారిచే రచితమై, ముద్రితమైన గ్రంథములలో మొదటిది విక్రమార్కుని కథలు-ఇది, 1819, 1828, 1850, 1858 లోగా, నాలుగుసారులు ముద్రితమైనది. పంచతంత్రము, 1834, 1848, 1861, 1869 లో నాలుగుసారులు ముద్రితమైనవి. ఈ ముద్రణములను బట్టియే, వీనికా కాలమునగల వ్యాప్తిని తెలుసుకొనవచ్చును. చిన్నయసూరి రాజధానికళాశాలలో పండితుడుగా నున్నప్పుడు మొదటి కొన్నియేండ్లు పై గ్రంథములనే పాఠములుగా చెప్పినాడు. తాను ప్రధాన పండితుడై పలుకుబడి సంపాదించిన వెనుక, తన నీతిచంద్రికను పఠనీయ గ్రంథముగా చేసికొన్నాడు. పై రెండు గ్రంథములే గాక, బాలవ్యాకరణమునకు నిరువదిమూడేండ్లకుముందు, నొక

తెలుగు వ్యాకరణము రచించెను. ఈ శతాబ్ది వచన రచన కితడు ప్రారంభకుడు.

పాటూరి రామస్వామి శాస్త్రి 1840 శుకసప్తతి కథలు.

ఈతడు, ఫోర్టుసెంటుజార్జి కళాశాలలో మూరిసు దొరగారివద్ద తెనుగు మునిషీగా నుండెను. ఈతడు శుకసప్తతి వచనకావ్యముగా రచించెను. ప్రస్తుతము బజారు ప్రతులలో నీతని పేరు మఱుగుపడినది. కాని తే 19-9-1843 దిని బ్రౌనుదొరవారికి వ్రాసిన లేఖనుబట్టి యీతడే శుకసప్తతి కర్తయని తెలియుచున్నది.

సింగరాజు దత్తాత్రేయులు - వేంకటసుబ్బయ్య 1840.

వీ రిరువురును కలిసి రామాయణ వచనమును రచించిరి. ప్రస్తుత మీ గ్రంథమున దత్తాత్రేయులు రచించిన అరణ్యకాండ, కిష్కింధాకాండ, వేంకటసుబ్బయ్య రచియించిన యుద్ధకాండ లభ్యమగుచున్నది. ఇది గ్రాంధికరచన.

పైడిపాటి పాపయ్య 1840 రంగనాథ రామాయణ వచనము.

గోనబుదారెడ్డి రచిత ద్విపదరామాయణమునకు వచనకావ్యముగా, సాంద్రీసుదొరవారి యనుజ్ఞచొప్పున పైడిపాటి కొండలయ కుమారుడు పాపయ్య వ్రాసినది. శైలి [illegible] నున్నది.

పాటూరి నరసింహశాస్త్రి-హరిశ్చంద్ర కథ 1840.

ఈతడు పై రామస్వామిశాస్త్రి సోదరుడు-హరిశ్చంద్ర కథను వచనముగ రచించెను. మఱియు రంగనాథరామాయణ ముత్తరకాండవచనముగ రచించెను.

పాటూరి రంగాశాస్త్రులు 1841-విజయవిలాస వచనము.

ఈతడును పై రామస్వామిశాస్త్రుల సోదరుడే. ఈతడు విజయవిలాసమును, చేమకూర వేంకటకవి రచన ననుసరించి వచనముగ రచించెను

పై వా రిద్దరునుకూడ కాలేజీలో తెనుగు మునిషీలుగా నుండిరి. ఈ విషయములు పూర్వోక్తమగు బ్రౌనుదొరగారికి వ్రాయబడిన లేఖలనుండి తెలియుచున్నవి.

ధూర్జటి లక్ష్మీపతి క్రీ. శ. 1842 - హంసవింశతి.

అయ్యలరాజు నారాయణకవి విరచితమైన హంసవింశతి పద్యకావ్యమున కిది వచనరచన. ఈ గ్రంథము క్రీ. శ. 1842 లో వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలలో ముద్రితమై ఆ పత్రికయందే ప్రకటన చేయబడినది. ఇది పద్యరచనకన్న సులభగ్రాహ్యముగా నుండుటచేత, క్రీ శ. 1865 లో తిరిగి ముద్రితమైనది. ఇందలి శైలి యెట్లుండెనో తెలుపుటకై క్రిందిభాగ ముదాహరించు చున్నాడను.

"హేమావతిని మోహంబు చిత్తంబు నత్తల పెట్టుచున్న, కస్తూరితిలక వాసనలు ముఖవాసనలకు లంచం

బీయగా, నవరత్నఖచిత తాటంకద్యుతులు కపోలంబుల జిగికి నుపాయనంబు లొసంగగా, మానికంబు దండలహారాయలు శరీరకాంతికి కట్నమిడగా, విడిసిన మన్మథగజంబువలె బెడగైన నడల నిల్లు వెడలి బిసుచో హంస యాహంసగమనం గాంచి యిట్లనియె."

కీరబహత్తరి - తోతీనామా లేక చిలుక కథలు 1842.

ఇది శుకసప్తతి వచనము—వెనుక దానికంటె భిన్నరచన గలది. ఇందు పారసీకపుఁ పేళ్లు తఱచుగా గలవు. కథావిధానము ఉపోద్ఘాతరచన బాగుగ నున్నది - వ్యావహారికరచన - ఇందు 52 కథ లున్నవి.

దిలారామకథ 1843.

దిలారాం అను పేరుగల ఢిల్లీపాచ్ఛా కూతురు, అమరావతీపట్టణపు రాజుకొడుకును పెండ్లాడుట. ప్రధాన కథాశరీరముగా నున్న యీ విచిత్ర కథాకోశమున, రాజకుమారుల మంత్రి కుమారుల దేశాటనము, మంత్రికుమారుడు తన యత్యద్భుత ప్రజ్ఞా ప్రయోగవిశేషముచే, పలుతడవలు రాజకుమారుని రక్షించుట అతని నేస్తుచేతనే తూదిని సర్వక్షేమములు కలుగుట యిందు చమత్కారజనకముగా గానవగును.

బత్తీసుపుత్రి కథలు 1847.

ఇది సింహాసన ద్వాత్రింశిక యను సంస్కృత గ్రంథమునకు తెనుగువచనము. బత్తీసుపుత్రికథ లనగా ముప్పదిరెండు బొమ్మల కథలు. ఇది క్రీ. శ 1847 లో వాడ్రేవు వెంకయ్య యను కవిచే రచితమైనది. శైలి సరళ వ్యావహారికము.

వైయాకరణము-రామానుజాచార్యులు ఆదిపర్వము-వచనము 1847.

ఈ గ్రంథము శ్రీ పరవస్తు చిన్నయసూరిచే సరిచూడబడి, క్రీ. శ. 1847 లో నన్నయభట్టారక రచితాదిపర్వముతో కూడ ముద్రితమైనది. ముఖ పత్రమున చిన్నయసూరి పేరుండుటచేత, దీనిని సూరి రచనలలో నిటీవలివా రొకటిగా చేర్చిరి. కాని గ్రంథము చూచినవారికి రచయితనుగూర్చి సందేహమే కలుగదు.

ఓ యయాతి మహారాజా! నీవు సకలధర్మార్థ ముల నెఱింగినవాడవు గనుక మాకు పుణ్యలోకము లేమయినా గలవా చెప్పవయ్యా! అని యడుగగా మీకు పుణ్యలోకములు గలవని చెప్పిన యయాతి మాటలు విని వారు ముగ్గురున్ను సంతోషించి మేము నీ కూతురి బిడ్డలైన మనుమలమని తమ్ము నెఱింగించి పుణ్యలోకముల నిచ్చిరి. ఆ యయాతి ఆ సత్పురుషుల సాంగత్యమువలన తానున్ను తన మనుమలున్ను పూర్వలోకమునకు పోయిరి.

వేతాళపంచవింశతి కథలు 1848.

ఇది కథాసరిత్సాగరమునుండి గ్రహింపబడి వాడుకభాషలో వ్రాయబడి, మిక్కిలి వ్యాప్తిలో నున్న కథారచనము.

కాంభోజరాజు కథలు 1849.

ఇవి రెండు తెలుగులుగా నున్నవి. ఒకదాని యందు అనంతామాత్యకృతమైన భోజరాజీయము నందలి పద్యములు గలవు. కావున నది పద్యప్రబంధ రచనకు తరువాత జరిగినది. రెండవ దానిలో పద్యములు లేవు, రచనయు భిన్నముగ నున్నదిగావున నదియే మొదటిదని చెప్పవచ్చును. (R 720)

తాతాచార్యుల కథలు 1855.

ఈ వినోదకథలను, భాషోద్ధారకులు బ్రౌను దొరవారు 1855 లో మూలమును, వారి యాంగ్లేయ భాషాంతరముతో ప్రకటించిరి. ఈ కథలను సంపాదించిన విధమునుగూర్చి బ్రౌనుదొరవారే వారి యాంగ్లేయోపోద్ఘాతములో నిట్లు వ్రాసియున్నారు. ఇందు గిరిన్మయూరే అను కథ గద్యచింతామణిలో నుదాహృతమైనది. (చూ॥ పుట 84.)

"The anecdotes Collected in this volume were-chiefly related to me by a Telugu Brahmin named Tatachari in the year 1842. He was a tall stout man of about 50 years of age,

A humorist thoroughly versed in Sanskrit learning, eloqneut, most modest and humble and died in my employ. He was a poet and a logician skilled in Medicine and Astronomy I read some of the Telugu poetry with him and in the course of amusing conversations. he related to me the tales here preserved. 13-1-1855.

### యాత్రా చరిత్రలు.

### ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్ర 1830.

వీరాస్వామయ్యగారు చెన్నపురికి పేరుతెచ్చిన తెనుగు వారిలో నొకరు. వీరు క్రీ. శ. 1780 ప్రాంతమున జన్మించి 3-10-1836 లో దివంగతులైరి. క్రీ. శ. 1830 సంవత్సరములో వీరు కాశీయాత్ర చేసినప్పుడు వారు వ్రాసిన దినచర్యారూపమగు యాత్రాచరిత్రము వారి మిత్రులు కోమలేశ్వరపు శ్రీనివాస పిళ్లగా రచ్చువేయించిరి. ఇది నవీనముగ ముద్రితమైనది. దీని శైలి సరళమైన వ్యవహార శైలిగా నున్నది. వ్యాప్తిలో నున్నందున నుదాహరణము చూపలేదు.

### కోలా శేషాచలకవి నీలగిరియాత్ర.

కోలా శేషాచల కవియను చెన్నపట్టణనివాసి సైనికశాఖాధ్యక్షుడగు థామస్ సింప్సన్ దొరవారి కచ్చేరీలో గుమాస్తాగా నుండెడివాడు. క్రీ. శ. 1845

మే నెల తే 12 ది మొదలు—13-1-1847 వఱకు నుదకమండలమున కార్యస్థాన మున్నప్పుడు జరిగిన వృత్తాంతము నీలగిరియాత్ర యను వచనకావ్యముగా రచియించినాడు. ఇందలి శైలి రసవంతమైనది. ఈ గ్రంథము 1847 లోనే రచితమగుటచేత చిన్నయ సూరి నీతిచంద్రిక (1856) కన్న ముందు వెలసినది - నుచ్చున కిందలి పంక్తుల నిచ్చుచున్నాడను.

"నా విడిదలయగు నిలుసొచ్చిన యనంతరంబ నెచ్చటఁ గూర్చుండిన నెచ్చట గ్రుమ్మరిన నెద్ది యంటిన నా సర్వాంగ బతి శీతలంబయి గోచరించె. అంత కొంత తడవునకే చలి మొలతెంచె. మార్గ శ్రమంబు నవ్విడిదల ప్రవేశించు సమకాలంబునను, శీతంబు గోచరింపదయ్యెదని తోచెను. మఱునాడు నాకును, నా బాసటనై వచ్చిన శ్రీనివాస మొదలార కిని స్వదేశమునుండి కొంపోయిన చలితోడవు లాడల్లం దోడిగికొనవలసివచ్చె. అగ్నియొక్కటి దక్క యన్నిపదార్థంబు లతిశీతలంబులై యున్నయవి.

శ్రీకోలా శేషాచలకవి.

19-వ శతాబ్దమున ప్రౌఢవచన రచనకు మొదటి కావ్యమని నేడు విమర్శక లోకము గ్రహించు నీతిచంద్రికకన్న, (1856) ముందు రచితమయిన 'నిలగిరియాత్ర' అను వచనకావ్యమునకు కర్తయగు శ్రీ శేషాచలకవిగారు లెఫ్టినెంటు కర్నల్ తామస్

సిమ్సన్ అను దొరవారి ఆఫీసున ప్రధానోద్యోగి యగు శ్రీమాంగాడు శ్రీనివాస మొదలియారునకు గుమాస్తాగా నుండెడివాడు. ఈ తామస్ సిమ్సన్ విక్టోరియా రాణిగారికి Deputy Adjutant General అను పదవియందుండెను. ఈతడు చెన్న రాజధానికి గవర్నరయిన Marquiss of Tweedel దొరగారి కార్యవర్గములో నొకడు.

శ్రీ శేషాచలకవి క్రీ. శ. 1846 సం॥ మే నెల 12-వ తేదిని గవర్నరుగా రగు ట్వీడల్ దొరవారు తమ సమస్త పరివారముతో నీలగిరికి వెళ్లునప్పుడు వారి కార్యనిర్వాహకవర్గముతో సంబంధించిన వారితో గూడ నీలగిరి వెళ్లెను. తే 13-1-1847 ది తిరిగి చెన్నపట్టణము చేరుకొనెను. పూర్తిగ ఎనిమిది నెలలు పట్టిన యీ నీలగిరియాత్ర శ్రీ శేషాచలకవియొక్క శాస్త్రీయమైన దినచర్యగ్రంథము, వాఙ్మయమున కాలక్రమమున ద్వితీయమైనను, గ్రంథరచనయం దద్వితీయమైన కావ్యముగా విలసిల్లినది. ఈతడు చెన్నపట్టణమున చింతాద్రిపేటనివాసి. తన వాస స్థానమగు చింతాద్రిపేట[1]ను యీ క్రింది సీసమాలికలో వర్ణించియున్నాడు :

---

1. చెన్నపురమందలి ప్రత్యేక భాగములు "చెన్నపురీ విలాసము"న వర్ణింపబడినను అది క్రీ. శ. 1864 లో రచితమగుటచే నీ ప్రత్యేకవర్ణనకు శ్రీ శేషాచల కవియే ప్రథముడు.

సీ. సకలచరాచరసమితి కాధారమై
అమరు నీ భూమండలమున నెల్ల
కాలంబును పవల్లురేలు సమానంబు
లైయొప్పు నెయ్యెడ నయ్యదియని
రక్షప్రదేశంబుననియు విష్కంబరే
ఖయునని విఖ్యాతిగనియెనాని
రక్షప్రదేశంబు నాదిగనరియుత్త
రాశి త్రయోదశాక్షాంశములును
నలుకళల నశీతికళలదూరమున గ
లైడు పూర్వపశ్చిమరేఖయందు
వినుఁడు గంగామహాద్వీపవతీతట
ప్రాంచిత కాశికాపట్టణమున
అంబుజబంధుడుచ్చంబునయందు గా
నంబడు వేళ కనంతరమున
ఇరువదియును నేడు నరయునుబరకవి
ఘటిక కుచ్చము యెక్కుడను గాన
బడును నచ్చుట గడుపొడవగు రాజద్వా
జముగలదై యుత్తరమునయందు
బంగాళదేశంబవాచినిఁ గన్యాకు
మారియు ప్రాక్పశ్చిమముల వారి
నిధులు మేరలుగాగ నెలకొన్న ధారుణీ
రాజ్యంబులకెల్ల రాజధాని

ద్యై సకలాంతరీపాంతర దేశాంత
రాగత వివిధజనావళినంకు
గీ. లంబును రమాస్పదంబును లసితహర్మ్య
రమ్యమును నగు చెన్నపురంబునకును
ప్రాంతమందున దక్షిణపశ్చిమమునఁ
దనరు మద్యానభూమి చింతాద్రిపేట

పైవర్ణనయందు చెన్నపురి నేటి భూగోళశాస్త్ర ప్రకారము చెప్పు నక్షాంశరేఖలు 13. 4 N 80. 12 E యివి యన్నియు ఆకాలమునందే తెలుపబడినవి. ఇంతియేకాక సూర్యుడు ఇరువదియేడున్నర విఘటికలకు యేకాలమున నుచ్చమున నున్నట్లు కనబడునో ఆభూభాగమునందు అని చెన్నపట్టణముయొక్క భూమధ్య రేఖాపరిమితి ప్రదేశమును శాస్త్రీయముగ తెల్పియున్నాడు.

ఈగ్రంథమున మూడు ప్రకరణములు గలవు. గ్రంథమంతయు వచనమైనను పద్యకావ్యసంప్రదాయమువలె ఆశ్వాసాద్యంత పద్యములు రచింపబడినవి వానిలో గర్భకవిత్వము, బంధకవిత్వముగల వృత్తములు గలవు. ఇందలి వచనరచన ప్రశస్తమగు గ్రాంథికశైలిలో నున్నది. కవి అన్యదేశములను ఆకాలమునందు గల వ్యవహారానుగుణముగ ప్రయోగించియున్నాడు. ఇది యాత్రగా ఆయాప్రదేశముల మాటలాడు భాషలను మనము గ్రహించుటకొరకు

ఆ గ్రామ్యభాషలోనే కొన్ని గురుతులు పెట్టి యుపయోగించినాడు కేవలము ద్రవిడపదములనుగూడ వేఱుగా సూచించినాడు. దీనివలన సుసంస్కృతమగు తెలుగుశైలిని పెంపొందించుటకును తెనుగు భాషా తత్త్వమును నిలుపుటకును నీ కవి యెంతయో పాటు పడినవాడు.

ఈతడు కంచి, వేలూరు, సేలము, ఉదకమండలము మొదలయిన ప్రదేశములయందు తను చూచినట్టి జంతు వృక్ష క్రిమి కీటకాదులను, అందందు నివసించుచున్న జనుల భాషను, ఆచార వ్యవహారములను యీ గ్రంథమున బహురమ్యముగ చిత్రించినాడు. ఇంతియేగాక భూగోళ శాస్త్ర పరిజ్ఞానముగల్గి వాతావరణాది విషయములను గూడ యిందు జొనిపియున్నాడు. తన కాలములోగల జనుల నిత్య జీవితమును చక్కని వాఙ్మయమున వచన రచన గావించిన కవులలో నితడే ప్రథముడు. కవి ప్రజలలో నొకడను సిద్ధాంతముగల నేటి కాలమున యీ ప్రశస్త వచన రచన కొన్ని వెలుగుబాటలను చూపకపోదు.

ఈకృతి విశాఖపట్టణమందలి జమీందారులలో నొకరగు గోడే శ్రీ వేంకటజగ్గనృపాలున కంకితము. కృతిపతి వంశావతారికలో నీతని ప్రశస్తి వర్ణితము.

పౌరాణికము.

ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులు

శివరహస్య ఖండము 1852.

స్కాంద పురాణాంతర్గత శివరహస్య ఖండమునకు, తత్త్వప్రకాశిని యని ప్రశస్త వచనమును, ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులు రచియించెను. దీనినిగూర్చి వివరణము.

ఇది స్కాందపురాణ శంకర సంహితయందు 13000 శ్లోకములుగల ఖండము. ఇం దేడు కాండలు (1) సంభవ (2) అసుర (3) వీరమాహేంద్ర (4) యుద్ధ (5) దేవ (6) దక్ష (7) ఉపదేశములు అనునవి. తెనుగున వచనము వ్రాసిన గ్రంథకర్త చంపూకావ్యమువలెనే గ్రంధావతారిక, అశ్వాసాద్యంత గద్యపద్యములు వ్రాసియున్నాఁడు. మఱియు ప్రఖ్యాత శైవ గురుడగు నుద్భటారాధ్యులనుండి తన వంశక్రమమును వర్ణించియున్నాడు.

కాశీ విశ్వేశ్వరునివలన ఉద్భటారాధ్య గురుడు జన్మించెను. అతఁడు కాశియందుండగా, పరమేశ్వరుడు కరుణించి మల్లనారాధ్యుఁ డను సుతు నొసంగెను. ఇతడు ముదిగొండ గురుడు. తరువాత విశ్వనాథ దేశికుడు జన్మించెను. ఈ వంశక్రమ మిట్టిది.


ఉద్భటుఁడు
ముదిగొండ గురుడు-మల్లనారాధ్యుఁడు
విశ్వనాథ దేశికుఁడు
1. భార్య అన్నపూర్ణ
2. భార్య ఎఱ్ఱాంబ
వీరారాధ్యుడు
లింగనారాధ్యుడు
అచ్చమ-భార్య
నాగలింగము
(పాపమ-భార్య
బ్రహ్మయలింగము
దత్తు-భార్య విశాలాక్షి
బ్రహ్మారాధ్యుడు
లేక
బ్రహ్మయలింగము
విశ్వపతి
మల్లనారాధ్యుఁడు
పాపయసూరి
రామయ్య
అష్టభాషాకవి
పెదవిశ్వనాథుఁడు
చంద్రయ్య
అహోరయ్య
నాగలింగయ్య
బసవయ్య
విశ్వపతి-భార్య-పార్వతమ్మ
మల్లయారాధ్యుడు-భార్య సర్వమంగళాంబ
(భారద్వాజగోత్రుడు)

బ్రహ్మయలింగము-కృతికర్త.

తల్లి సర్వమంగళాంబ వంశము




బ్రహ్మయలింగము, తల్లితల్లియైన వియ్యమ్మ ఆరాధ్య కుటుంబములో ప్రసిద్ధికెక్కిన శ్రీ కాశీనాథుని వీరనారాధ్య కవిపుత్రిక. ఈతని గూర్చి కవి యిట్లు చెప్పియున్నాడు.

సీ॥ శ్రీ వ్యాఘ్ర నగరసంస్థిత నరేంద్రేశ్వర
వరలబ్ధ విద్యచే వాసికెక్కి
పరమతవాది భీకర బిరుదాంకుడై
స్వమత సంస్థాపనా చార్యుఁడగుచు
తర్కాది నిఖిల శాస్త్రములందు రెండవ
గౌతముఁ డనఁగఁ బ్రఖ్యాతివడసి
రాజాధి రాజులు పూజించి తనకిచ్చు
నాందోళికంబుల నధివసించి

మించెనల కౌశిక సగోత్ర మంచి తప్ర
తితిఁగాంచెను ః ధన్యుచేత ననుచు
సాధులు నుతింప శ్రీ కాశినాథ వంశ
దీపకుఁడు వీరనారాధ్య దేశికుండు.

తన మేనమామయు బ్రహ్మయ నామాంకితుం డును నగు ములుగు బ్రహ్మయారాధ్యుని యిట్లు వర్ణించియున్నాఁడు.

కవితా గాన విలాస పేశలిత
వాక్చైవిద్య సంప్రీతి పా
ర్థివ దత్తాభరణోత్తమా
శ్వవసుధా దివ్యాంబ రాందోళికా
దివి శేషాన్విత వస్తుసంప
దభివృద్ధిం గాంచి విస్తుల్యుఁడై
భువి నా బ్రహ్మయ దేశికేంద్రుఁ
డలరెన్ భూరి ప్రభావోన్నతిన్.

శివరహస్య ఖండము మంచి వచన రచనగల కృతి. శైలి సరళము, సంస్కృతాంధ్ర సమపద ఘటి తము. మచ్చునకు.

విష్ణునేత్ర సంజనితలగు సౌందర్యవల్లి, అమృత వల్లి యను కన్యలిద్దఱు నొద్దిశ నద్దేవ సేనాపతిం వరింపందలంచి మోహంబున మన్మథ శరావిద్ధ చిత్తలై, యా చిత్తరులు విశాఖుని డభంగ తపశ్చర్యంగాని వరింపఁడని మనంబున నిశ్చయించి యహోరాత్రంబు

లాహార నిద్రల నూహింపక కుమారుఁ డుద్భవించిన శరవణ తటాక తటంబుఁ జేరి దుకూలవసనంబుల విసర్జించి, నారచీరల దాల్చి మణికాంచీదామంబులు దలంపక శిరపుంజి మహాంజీభరితలై యాగరితలు భస్మ త్రిపుండ్రంబులు రుద్రాక్షాభరణంబులు దాల్చి జటాధారిణులై షడక్షరీ మంత్రంబు జపియించుచు దహార పుండరీకంబున గుహుని నిల్పి యనేక హాయనంబులు నిరాహారులై తపంబు సేయుచున్న బాహులేయుండా యువతుల యతిశయ తపశ్చర్యఁ జరించుటఁ గాంచి యవార్యంబగు దయదళుకొత్త యత్తటిం బాడసూపు వేడుక పొడమ మణిహారావలీ విలసిత వక్షస్థలుండు దరహాస చంద్రికా విరాజమాన ముఖచంద్రుండు నగుచు మారట మారుఁడోయనఁ గుమారుండు గానంబడియె. పుట 68.

ఈ వచనముపేరు టీకాతత్త్వ ప్రకాశిని. ఇది క్రీ. శ. 1852 లోను క్రీ శ ౧౮౯౮ లోను రెండు మార్లు ముద్రితమైనది. ఇందేడు కాండములలో 240 యధ్యాయములు కలవు. ప్రతి యధ్యాయమునందును వచనభాగమును సంగ్రహముగా దెలుపు పద్యములు కలవు.

పత్రికావాఙ్మయము – వర్తమాన తరంగిణి.

1842 – 1850.

ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలలో నిది పేరెన్నిక గన్నది. ఇందలి శైలిని తెలియుటకు – నా పత్రిక

యందుండి యొక యుత్తరమును సిందు ప్రకటించు చున్నాను.

మహారాజశ్రీ వర్తమాన తరంగిణి ఎడిటరుగారి సముఖమునకు. ఈ యడుగున వ్రాసుకొన్న పద్యంబు తమ పత్రికలో ప్రచురము చేసి పండితులగువారివలన నా పద్యంబు కర్థంబు చెప్పించి తిరుగా తమ పత్రికలో ప్రచురము చేసి నా అభీష్టం బీడేర్తురని తమ ఘనమును బహుధా ప్రార్థించెదను. అగత్యముగా నీ పద్యం బీసారి ప్రచురము చేయవలెనని కోరెదను.

పద్యము

ఉ. కోడిగి మింతెగాని తనకుజ్జ
వయసెక్కుడిదమ్మ నేత్రముల్
వాడు గదమ్మ పంట పగబట్టిన
దాని సుధారసంబు ము
ద్దాడు గదమ్మ యీ చెలియ
కక్కట వల్పులటమ్మ యీడికల్
వేడుకలాయె మట్ల తిరువేంగళ
నాథ యనంత శౌరికిన్.

యీ పద్యములో తప్పిదంబులున్న దిద్దించినవి అభిప్రాయము పోనీయకుండా అర్థము తమ పత్రికలో ప్రచురము చేతురని కోరెదను.

1842 సం. అక్టోబరు నెల 22 వ తేది

తమ వినయవిధేయుడగు
చి. సూ.

### లేఖా వాఙ్మయము.

ఈ వాఙ్మయశాఖకు మూలపురుషులు బ్రౌను దొరవారే. వారి లేఖలు పది సంపుటములు గలవు. వానివలన సమకాలిక సాంఘిక సారస్వత చరిత్ర మంతయు సంపూర్ణముగ విశదము కాగలదు. ఆ కాలము నాటి యుత్తరముల శైలి తెలుపుటకు రెం డుదాహరణ ముల నొసగుచున్నాడను.

15-6-21. తెలుగు జాబుల పుస్తకం.

స్వస్తిశ్రీమన్మహారాజరాజశ్రీ ఛార్లీసుపిలీపు బ్రౌంధొరగారి సముఖానకు.

తమ పండితుడు ములుపాక బుచ్చయ్యశాస్త్రి వినయపూర్వకముగా అనేక సలాములు చేసి వ్రాసుకున్న విజ్ఞాపన పత్రిక యేమంటే తమ శెలవు ప్రకారము కృష్ణారెడ్డి పంపించిన వసుచరిత్ర ప్రతిపదార్థ ప్రకాశిక తమరు అంగీకరించినది లేనిదీ తెలియలేదు. ఇక్కడనైతే బహుమంది పెద్దలు బహుదేశములవారు వ్రాసుకొని పోతూనూ వున్నారు. తమ పేరిటి కృతి గనక తనంతనే విస్తరిల్లుతూ వున్నది. నేను తమకు సుకృతంగా పాఠశాలపెట్టి అనేకమందికి ఆంధ్రగీర్వాణ వ్యాకరణ కావ్యనాటకాలంకారాది గ్రంథములు అభ్యసింపచేస్తూ యున్నాను. ఇంత పర్యంతరము తమరు యిప్పిస్తూవచ్చిన ద్రవ్య ముపయోగించి కాల యాపన చేస్తూవుంటిని. ఇప్పు డా ద్రవ్యము సరిపో

నందున అశనాచ్ఛాదనాలకు నానాశ్రమపడుతూ వున్నాను. లోగడ సముఖాన మనవిచేసుకున్న ప్రకారము యీ ఘటము వున్నంతకు అన్నము యిచ్చి కాపాడితే తమకు బహు పుణ్యము వస్తూవున్నది— తమరు వుపేక్షచేసినపక్షమందు యీ వార్ధకములో బహు కష్టపడేను. కాంగా నాయందు కటాక్షించి నాకు అన్నానకుగా కృష్ణారెడ్డికి వ్రాయించి దయ చేయ కర్తలు. పత్రికముఖాంతరం విశేషము యేమి వ్రాయవలసినది. యీ పత్రికనే సన్నుగా కటాక్షించి అన్నమిచ్చి కాపాడవలె నని కోరుతూవున్నాను. ఈ చిన్న గురువరాజు మనవిచేయగా నా వర్తమాన మంతా చిత్తానకు వచ్చేని. యింతే విజ్ఞాపన పత్రిక. వైశాఖ కృష్ణ 8 లు. బుచ్చయ్యశాస్త్రి స్వహస్తము వ్రాసుకున్న విజ్ఞాపనపత్రిక కడపనుంచి పంపించడ మైనది.

* * * *

(1832 - ఆగస్టు 26 -)

మహారాజరాజశ్రీ బ్రౌను దొరవారికి—

మహాకాశమందు బుద్ధిని్న—ఘటాకాశమందు మనస్సునున్న—మనోకాశమందు చంద్రునిన్ని— చిదాకాశమందు సూర్యునిన్ని—వెలిగించుతూ పరాకాశమనే పరమపదమందు చిదానందస్వరూపుడయి సర్వసాక్షినై, సత్యమనే నీడలో సదా వెలుగుచున్న

సర్వేశ్వరుని దివ్యపాదారవింద సన్నిధికి, ఓం, నమో నారాయణాయ, హే, భగవాన్.

ఏలినవారి సృష్టిలో చేరిన అనంతజీవకోటిలోను మోటుపల్లి వెంకటరామానుజదాసుడు ఒక విన్నపంబు చేయందలంచి ప్రార్థింపుచున్నాడు. సావధానచిత్తులై నవధరింపవలయును.

ఉత్తరఖండం లేటు ప్రావిన్షయల్ కోర్టు లేటు జడ్జిగారైన "న్యాకినెల్ వెబ్బు" దొరవారు యీ ఖండం పరిపాలనచేసే కాలమందు ధర్మసభలోను సుఖాసీనులై కొలువుండి ప్రసంగవశాత్ సభికులతో తమ అనంతరం హిందూరాజ్యమందు తమవలెనే ధర్మస్వరూపులై, సత్యవ్రతులై, శాంత శమదమాది సద్గుణములు గలవారలై సీ. పీ. బ్రౌనుదొరవారు సమస్త సాదుబీదలను సంరక్షణ చేయబోతున్నారని యానతిచ్చియున్నమాట సత్యము.

ఆ వాక్యమును నేను నెరనమ్మి, యిరువై యొక సంవత్సరము యేకాంతప్రదేశంబున సమాధి జరిపిన మీాదట నాకు సంభవించిన యాపత్తులలో ముఖ్యమైన సహోదరుడు సుతుడు వీరు వుభయులు కాలంచేసిన మీాదట నేను సతీసమేతముగా శ్రీరంగయాత్ర నిమిత్తమై బయులుదేరి యీా రాజధాని ప్రవేశించినమాట సత్యము.

పూర్వపు పెద్దల సత్యవాక్యమును పరిశోధించుటకై యీ బ్రవుణ్ దొరవారిని ఆశ్రయించి వారి అనుగ్రహ అభయహస్తములను వడసి వారి యాజ్ఞలు శిరసావహించి యీవరకు కాచియున్నమాట సత్యము.

15-6-1821.

చారిత్రక శాస్త్రీయ గ్రంథములు

కాంచీపుర మాహాత్మ్యము 1802.

కుంఫిణీకాలములో చారిత్రకరచనకు పునాది వైచిన కల్నల్ మెకంజీ దొరవారికి గురుస్థానీయుడగు కావలి వేంకటబొర్రయ్యగారు—కాంచీపుర మాహాత్మ్యమును వచనరూపముగ రచియించి యున్నారు. క్రీ. శ. 1803 నుండి 1812-13 వఱకు కైఫీయతులనేకములు రచితములైనను వానికి వాఙ్మయమున స్థానములేదు.

శాస్త్రీయగ్రంథములు మొదట పద్యరూపమున నున్నను నవి వచనరూపముగ వ్రాయుటకు కుంఫిణీ కాలమున వచనప్రాధాన్యమే మూలము—అట్టివానిలో కొన్నింటి నిందు తెలిపెదను.

పాకశాస్త్రము క్రీ. శ. 1836.

ఇది వచనముగ సరస్వతీబాయి అను నామె రచించెను. దీనిని యీకాలముననే, కర్నలు మెకంజీ దొరవారి పండితుడైన కావలి వేంకటరామస్వామి యాంగ్లేయభాషలోనికి భాషాంతరీకరించెను. దీని ప్రతి

బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయములో గలదు. ఇందు మూడు భాగములు 90 పుటలు గలవు.

సిద్ధాంత శిరోమణి - అల్లాడి రామచంద్రశాస్త్రి.
క్రీ. శ. 1837.

"అయ్యా యిదియంతయున్ను సరేకాస యూ సాహేబు బహు ప్రవీణుడని మీరు స్తుతిజేసి నందుననే యతనికి సంస్కృతభాషయున్ను దెలుసునని తోచెను. ఇట్లుండగా నేల మరల రాష్ట్రభాషతో నేకదేశీయ గ్రంథమును జేయించెను ఇందువలన నిష్ఫల శ్రమ జేయవలసెను. సంస్కృతభాషతో జేసియుంటే యన్ని దేశములయందున్ను ప్రయోగించునే యనుచున్నారా చెప్పుచున్నాము.

"అంధూదమువలె సంస్కృత
గ్రంథార్ణము సంగ్రహింప కష్టము గంగా
సింధువువలె యూంధ్రవచన ప్ర
బంధము సులభంబు జగతి బాలునకైనన్."

"భూకంపమునకు కారణము శేషుడు గాడు. ఇంక నేమియన్నను - భూమధ్యమునందు నానాపదార్థము లున్నవి. అవి కలసియున్నవి. మన శరీరమునందు వాయురక్తముల సంచారమునకై వాడేమార్గము లేచొప్పున నున్నవో ఆచొప్పున పృథివియందున్ను, వాయుజలములు నడిచేటందుకై మార్గము లున్నవి. నీళ్ళగుణ మీలాగున నున్నదిగదా - ఉష్ణత్వముచేత

పలచనైయుబ్బి యెక్కువౌచున్నది. ఆ యుష్ణత్వము వలన నుదకములు ఆవిరి బైటికి వెళ్ళజూచుచున్నవి. వాటికి త్రోవలేకపోయెనా అవి తమ శక్తిచేత పృథివిని పగలగొట్టి బైలువెళ్లగా భూకంపమౌచున్నది. ఇటుగనుకనే యొకచోట భూకంపమౌచున్నది. ఒకచోట కాదు, శేషుడే కారణమైతే నంతటను నొక్కసారే కావలెను. శేషుని తల కదిలించుట కారణము కారాదు. నీళ్ళ పగలగొట్టుటే కారణమనెడిది సత్యము. నీళ్ళయావిరిబలము చేతనే నావలు నడచుచుచున్నవి."

పేజి 22.

1 - 52 భూగోళ. 1 - 53 ఖగోళ విషయము.

Siddhanta Siromani Prakasa
Puranic, Siddantic
and
Copernican Systems of the World
Compared
By
Ramachandra Subbajy Bapu
of Sehore near Bhopal in Malwa
Madras
1850
dedicated to L. Wilkinson, Dist Collector

Ch. Anantapuram.

"ఇతి శ్రీమద్రామచంద్ర సుందరపదారవింద ద్వంద్వస్యందన్మరందసాంద్ర బిందుసందోహతంద్రా

స్వాదన తుందిలేందిందిరాయమాన మాన సాల్లాడి వంశోత్తంసాత్రేయగోత్రాపస్తంబసూత్ర జ్యోతిర్నయ విత్సుబ్బాజిసూరేః సూనునా చంద్రపురమందిరేణ రామచంద్రేణ కృతసిద్ధాంత శిరోమణిప్రకాశం సంపూర్ణ తామిమత్" శ్రీ రామచంద్రార్పణమస్తు.

సంస్కృతశ్లోకములు

గ్రంథమంతయు వచనముతోనున్నది.

భారతి సైజున-100 పుటలుగలవు. ఇవికాక 6 పుటలలో
శ్రీరామచంద్ర పదపంకజషట్పదస్య
సుబ్బాజి సూరి తనయస్స సతాం మతస్య
అల్లాడివంశజనుషః ఖలు రామచంద్ర
నామ్నఃకృతిర్నిఖిల ఖేటవిదాం ముదోస్తు
రామచంద్రేణ రచితమ్ భూగోళ మభితో
భ్రమణ భ్రమభంగి భంగళగుడః (సమాప్తః)
పద్యములు కూడ నున్నవి.

చివర 6 పుటలు సంస్కృత గ్రంథము. కాశీలో రత్నేశ్వర పండితునికిని రామచంద్ర శాస్త్రికిని జరిగిన భూభ్రమణమును గూర్చి జరిగిన వాదము.

పుస్తకము మంచిస్థితిలోనేయున్నది. బైండు కట్టియున్నది. దీనితో *Campbell grammar Syntax* భాగము కలదు.

*Madras Printed by P. Batchelor at Malhure Mission Press, Pophams Broadway 1837.*

భూభగోళదీపిక - క్రీ. శ. 1843.

ఈ గ్రంథమున జ్యోతిశ్శాస్త్రమున వివరింపబడిన భూగోళ ఖగోళ విషయములును, శ్రుతి స్మృతి తిహాస పురాణాదులగు సప్రమాణ గ్రంథములయందు జెప్పబడిన బ్రహ్మాండ విషయములును తెలుగున సకల జనోపకరముగా రచితమైనది. దీని రచయిత కాంచీ నగరనివాసి, వెంకటాచార్యతనూభవుండైన వైద్యనాథ సిద్ధాంతి. గ్రంథము శా. శ. ౧౭౬౫ కు సరియగు క్రీ. శ. 1843 లో పురాణము హాయగ్రీవ శాస్త్రిల వారి వివేకాదర్శమను ముద్రాక్షరశాలయందు ముమ్మిడిశెట్టి పార్థసారథిసెట్టిచే అచ్చు సంపూర్ణముగ నెఱవేర్పబడెను. ఇందుండి యొక యుదాహరణ.

భూగోళ స్వరూపలక్షణాది విషయము.

"మీఁదజెప్పిన తీరున బ్రహ్మాండాంతర్వర్తియగు జ్యోతిశ్చక్ర సమ మధ్యప్రదేశముననుండే ఆకాశమున నీ భూగోళము స్థిరముగా నుండేలాగున భగవంతుని విచిత్ర శక్తిచేత నేర్పఱచబడియున్నది. అట్టి భూగోళము పృథివ్యప్తేజోవాయ్వాకాశములనియెడు పంచ భూతాత్మకమైనదిగానుండి, ఆపృథివీభూతాంశముతో మెండుగా జేరియుండడమువల్ల పృథివియని వ్యవహరింపబడియున్నది.

క్రీ. శ. 1820 లో చెన్నపురిలో 'ఉపయుక్త గ్రంథకరణ దేశభాషాసభ' (The Madras School

Text Book and Vernacular Society) యేర్పడి బడిపిల్లలకొఱకు సులభశైలిని వాచకపుస్తకములు ప్రకటింప నారంభించిరి. కాని యవి క్రైస్తవమత సంబంధము హెచ్చుగా గలిగియుండెడివి. క్రీ. శ. 1848లో పరవస్తు చిన్నయసూరి దీని కధ్యక్షుడైన వెనుక నీ గ్రంథసభవారు చక్కని రచనలతో విద్యార్థి లోకమునకు శాస్త్రీయ గ్రంథములనందించిరి. వానిలో మహామ్మదుచరిత్రము (1856) జానుబన్యయను చరిత్ర (1856) అమెరికాను కనిపెట్టిన చరిత్ర (1857) ముఖ్యమైనవి. మఱియు నప్పుడే క్రొత్తగ దేశములో ప్రవేశపెట్టబడిన యయోమార్గములు, తంత్రీ వార్తలు వీనినిగూర్చి పుస్తకములు వ్రాయించిరి. వీని కాలమున Railways అనగా 'ఇనుప కమ్మిత్రోవలు' అని 'మెఱుపుటపా' అనగా Telegraph అని పేర్లు. ఈ పేర్లతోనే క్రీ. శ. 1853 సంవత్సరమున వీనిని గూర్చి యొక పుస్తకము ప్రకటితమైనది. దానిలోని భాగములుకొన్ని గద్యచింతామణియందుదాహృతము లైయున్నవి.

మదరాసు విశ్వవిద్యాలయ స్థాపనము-1857
గ్రాంథిక రచనాప్రాబల్యము 1857-1890
చిన్నయసూరి- వేంకటరత్నయుగము.

క్రీ. శ. 1857 వ సంవత్సరము రాజకీయము గనేగాక మన సంస్కృతి చరిత్రమున ముఖ్యవత్సరము -అ యేడే- పాశ్చాత్యసంస్కృతిని మన కందజేసిన

విశ్వవిద్యాలయములు, భారతవర్షమున ప్రారంభమైనవి. మదరాసు విశ్వవిద్యాలయము, 1857 లో స్థాపితమైన వెనుక, తెనుగుభాషకు నుత్తమ విద్యాలయ పరీక్షలలో దేశభాష కావున ప్రముఖస్థానము లభించినది. ప్రథమ శాస్త్ర పరీక్ష, పట్టపరీక్ష మొదలగు నున్నత పరీక్ష లేర్పఱుపబడగానే యంతకుముందున్న సులభ వచన రచన లెంతమాత్రమును నుపయోగకారులు కాక పోయినవి. ఆ నాటికి దక్షిణాంధ్ర వాఙ్మయమునందలి వచన రచనలు బయటబడలేదు. కాగా, నాతికఠిన మును, నాతిసులభమును, నిర్దుష్టమునగు గ్రాంథిక శైలిలో, విద్యార్థిలోకమునకనువగు వచనరచన యప్పుడావశ్యకమైనది. ఈ గ్రాంథికరచనకు భగీర థునివంటివాడు పరవస్తు చిన్నయసూరి. అతఁడు క్రీ. శ. 1853 లో నవీనగ్రాంథిక వచనశాఖకు శ్రీకారప్రాయమైన నీతిచంద్రికను రచియించి తానే వాణీదర్పణ ముద్రాక్షరశాల యందు ముద్రించినాఁడు. ఆ కాలమున మదరాసు విశ్వవిద్యాలయ మేర్పడుట - అందు రాజధాని కళాశాలయే ప్రధానమగుట - ఆ కళాశాలాధ్యక్షుఁడే రాష్ట్రమున విద్యాశాఖకు ప్రధా నాధికారియగుట-చిన్నయసూరియందు తెనుగుప్రధా నోపాధ్యాయుఁడగుట - కారణములుగా, గ్రాంథిక భాషారచనలే,విశ్వవిద్యాలయములలో పాఠ్యగ్రంథము లుగా నియమితములై ప్రచారములోనికి వచ్చినవి.

నీతిచంద్రిక-

చిన్నయసూరి పంచతంత్ర హితోపదేశ కథలను గైకొని, మిత్రభేదము, మిత్రలాభము, సంధి, విగ్రహము అను నాలుగు భాగములుగా నీతి చంద్రిక యను గ్రంథము రచింపఁదలచి యందలి మొదటి రెండు భాగములు మాత్రమే పూర్తిజేసెను. ఆంధ్ర వచన వాఙ్మయమున 'నీతి చంద్రిక' యాచంద్రార్కము నిలిచెడి వచనరచన - వచనరచనకు ప్రాచీనకాలమున నన్నయ, నవీనకాలమున చిన్నయ యనుసూక్తిని సార్థకము చేసిన దీ కృతియే—ఇది పుట్టిన నాటనుండి పఠనీయ గ్రంథమై నేటికిని, ముందటికినీ గూడ పఠనీయ గ్రంథముగ నుండునదియే-ఇప్పటికి నేబది సారులు ముద్రణము నందినది. సుప్రసిద్ధమగు నీ కృతి యందలి సమగ్ర విశేషములను గూర్చి నేను రచియించిన "చిన్నయసూరి జీవితము" చూడనగును.

విశ్వవిద్యాలయ పాఠ్యప్రణాళికలో గ్రాంథిక రచనకే ప్రాధాన్యము ప్రచారము కలిగినందువలన దేశములో నితర నూతనశాఖలయందు గూడ గ్రాంథికభాషయే ప్రయుక్తమగుచుండెడిది - పత్రికలు - వ్యాఖ్యలు ఉపన్యాసములు-వ్యాసములు-లేఖలు ఏ విషయమునకు సంబంధించినను గ్రాంథికభాషలోనే వ్రాయుట యారంభమైనది. చిన్నయసూరి వెనుక రాజధానీ కళాశాలలో ప్రధానపండితులైన కొక్కొండ

వేంకటరత్నము పంతులుగారు, చిన్నయసూరి యారంభించిన గ్రాంథిక భాషా మహోద్యమమును స్థిరముగా నిలువబెట్టిరి. వారు తొలుత క్రీ. శ. 1866లో చిన్నయసూరి విడిచిన సంధివిగ్రహతంత్రములను నాశైలిలోనే రచియించి క్రీ. శ. 1872 లో విగ్రహతంత్రమును ముద్రించిరి. అది విశ్వవిద్యాలయములో నాఁడే పఠనీయగ్రంథమైనది. మఱియును గ్రాంథికభాషాప్రచారముకొఱకు, 'ఆంధ్రభాషా సంజీవని' యనుపత్రికను క్రీ. శ. 1871 లో మొదలిడి యిరువదేండ్లు నడిపిరి. అందులో వ్యాసములు, ప్రకటితములైన లేఖలు, వార్తలు నన్నియు గ్రాంథికభాషలో నుండెను. సభలలో నుపన్యాసములుగూడ గ్రాంథికభాషలో నుండెను. తుదకు వేంకటరత్నము పంతులుగారు నిత్య వ్యవహారమున గూడ గ్రాంథికమునే యుపయోగింపదొడగిరి. గ్రాంథికభాషయే రాష్ట్రమంతయును వ్యాప్తమయ్యెను.

ఇట్టితరుణముననే నవయుగ నిర్మాత కందుకూరి వీరేశలింగం పంతులుగారు వాఙ్మయరంగమున నడుగు బెట్టిరి. మొదట పంతులుగారును చిన్నయసూరి ననుసరించి, యట్టి సమానశైలితో సంధివిగ్రహములను రచించి ప్రకటించిరి. ఇవి రెండునుకూడ పఠనీయ గ్రంథములైవ్యాప్తిలోనున్నవి. వీరేశలింగముపంతులుగారుత్తరములయందెట్టి గ్రాంథికభాష నుపయోగించెడు

వారో వేంకటరత్నముపంతులుగారికి వ్రాసిన యీ క్రింది లేఖవలనఁ దెలియనగును. "మీయసమాన పత్రికా రత్నమ్ము, కరమ్మున నాకరమ్ము నలంకరించి ఘనమ్మగు మనమ్ము లేమిడి యెక్కుమ్మడి నుడిపి కడుంగడు-సంతసంబు నొదవించుచున్నయది - అంతకంత కొకవింత చెన్ను వహించి కాంచఁగాంచ కన్నులపండువు సేయుచుఁ జెవిం జొనుపఁ జొనుపఁ జవులు మివుల నించి యింపు సొంపు-నినుమడింపుచున్నది. అంతియకాక తనమధురముం జవిజూపి నా నాలుక తుప్పెల్ల డుల్లంజేసినది. వేయేల నలువయు విలువయు నలవిగాని దాని పోడిమిఁ గొనియాడ నీడుగాడన నావంటివాఁడా యిఁకఁ గొండాడగలవాఁడు (-1872) కాని వైజ్ఞానికముగ దినదిన ప్రవర్ధమానమగుచున్న నవీనయుగమునకిట్టి నియమములు గలిగిన రచన నిరోధకమగునని పంతులుగారు సులభ వచనరచనను సాగించి, ఆనాడు పద్యరచనకు తిక్కనవలె యీనాడు గద్యరచనకు తిక్కనయై, నవ్యయుగనిర్మాతలైనారు. వారినిగూర్చి ప్రత్యేకముగ ముందు చూడనగును.

వేంకటరత్నము పంతులుగారు క్రీ. శ. 1877లో నేడవ యెడ్వర్డు చక్రవర్తి భారతవర్షమును సందర్శించుటకు వచ్చిన సందర్భమును పురస్కరించుకొని 'ప్రిన్సు ఆఫ్ వేల్సు హిందూస్థాన సందర్శనము' అను వచనగ్రంథమును రచించిరి. ఇదియును పఠనీయగ్రంథ

మైనది. ఇందు సంస్కృతాంధ్రభాషలు రెండును సమముగా వాడబడినవి. మచ్చునకు సంస్కృతము.

"అనవరత శతఘ్ని ధ్వని ఘోషము చేతను, నానాముఖ ప్రణాళికా నిష్ఠ్యూతనిర్మలజలధారార్ద్రిత భూభాగము చేతను, సద్యస్కృత మరకత హరిత్ర విచిత్ర పత్రమయకాయమాన మండప ప్రాసాద దుర్గ రామణీయకము చేతను, సంప్రవృద్ధ ప్రావృడ్విపసంబన్నట్లు పొడకట్టె," తెలుగు:

"వేటతమకము, వీటిసింగారము, వయ్యాళుల యొయ్యారము, ఒడ్డోలగముల దొడ్డతికము, విందు కుడుపుల పొందిక, పందెముల మేలిమి పందిళుల యందము కానికలయింపు, బిరుదులసొంపు, మూఁకల పంపు, గుంపుల పెంపు చాగముల తెంపు విస్తరిల్లె."

క్రీ. శ. 1890 ప్రాంతమునుండి వీరేశలింగము పంతులుగారి సులభవచనరచన తన ప్రభావము జూపినను, క్రీ. శ. 1900 ప్రాంతమునుండియే, వారి రచనా ప్రాబల్యము సంపూర్ణముగ నాక్రమించినదని చెప్పనగును-క్రీ. శ. 1899 నాటికి వారి రచనములన్నియు సంపుటములుగ వెలువడినవి-అందువలన, విద్యాసంస్కారముగలవారు, వారి రచన లనేకముఖముగా పఠించి నూతనరీతిని వచనరచన సాగించుటకు ప్రారంభించిరి-ఇట్టియుగమున ముఖ్యపురుషులను పేర్కొని, క్రీ. శ. 1857 నుండి క్రీ. శ. 1900 వఱకు వచన

వాఙ్మయ మే యేశాఖల నభివృద్ధి చెందినదో వివరించు చున్నాఁడను.

కథావాఙ్మయము

ఒకవైపున విశ్వవిద్యాలయము స్థాపితమై గ్రాంధిక వచనరచనలు వెలువడుచుండ, వేఱొక వైపున ప్రజాసామాన్యమునకు సులభశైలిని కథా రచనలు వెలువడుచుండెడివి-ఆశాఖాచరిత్ర

పరమానంద గురువుల కథలు-1861

బెషీయను క్రైస్తవమతబోధకుఁడు రచించినవి. సరళ వ్యవహారశైలి-

అరేబియన్ నైట్సు కథలు-1862

ఇది పెర్సివలు అను నాంగ్లేయుఁడు రచించినది. వ్యవహారశైలి.

కామరూపకథ-1864 (రచనము)

ప్రసిద్ధరచయితయగు తడకమళ్ల వేంకటకృష్ణ రావుగారు రచించినది-ఇందలిశైలి గ్రాంధికము-మచ్చు నకు

కామరూపకథ

"అట్టి కుమారోదయంబువలన జన్మరాజ్యాదులగు, సప్తాంగంబులును, నప్పుడ యుదయించుకరణి నతికుతూహలియగు నద్దేవి, నా రాజన్యమాన్యుం డట్టి సుపుత్రుఁ డయ చేకొనంగిన సర్వశక్తియుక్తుండగు, జగ

ధీశ్వరు ననేక విధంబులం బొగడుచు నిట్టియభ్యుదయం బునకు బ్రధాన కారణభూతుండగు సంకల్పసిద్ధుం బలు విధంబుల నెన్నుచుం దదనురూపకోశ విశ్రాణన మంగళవాద్య శ్రవణపుణ్యాహఘోషణాది క్రియావిశేషంబుల నా వురుటిదినంబులన్నియుం గడపుచుండె.

అంత...కామదేవుం డనందగియుంటను కామ రూపుండను నన్వర్థమంగళనామం బిడియె."

కంబుకంధర చరిత్ర-1866 (వచనము)

ఇదియును కృష్ణరావుగారి రచనమే-ఎనిమిది యధ్యాయముల వచన గ్రంథము. వర్ణనాభాగముల పారిభాషికపదముల నుపయోగించుటవలన నిది పెద్ద నిఘంటువైనది - ప్రస్తుత ముపలబ్ధమగు గ్రంథము మూడవయధ్యాయముతో ముగియుచున్నది.

1 పై రెండును నముద్రితములె.

౨. తెలుఁగు వెలుఁగు ముగుద కత 1879

అను శ్రీమందాంధ్ర కవితావేదినీ విలాసము

ఇది తిరువళ్లిక్కేణి నిలయుండగు తడకమళ్ల వేంకటకృష్ణారావుచే రచింపఁబడి పిల్లలమఱ్ఱి పూర్ణయ్య సిద్ధాంతిచే పరిష్కృతమై చెన్నపురి శ్రీ నిధిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె. 1879. 102 పుటలు. చివర స్త్రీపద్యము కలదు

శ్రీ గోలకొండాఖ్యఁ జెన్నొందు వ్యాపారి
కులమున హారితస గోత్రమునను

యజుసున తడకమళ్లాన్వయజాతుండు
కైరవణీ సరస్తీరవాసి
కనకమ్మ గర్భ సంజనితుండు వేంకట
కృష్ణరావు సమాఖ్య వెలయుసుకవి
రసిక ప్రియార్థమై రచియించె తెలుంగున
నీచంపు కావ్యంబు నింపుమీర

గీ. పిల్లలమఱ్ఱి పూర్ణయ్య యను పీఠికాపు
రాధినేతృ సమ్మానితుండగు వెలయు
దైవ విదుని సహాయము తనకు గలుగ
ముద్రితము జేసి వెలయించె ముదముమీర

ఇది తెనుగుకవిత్వమునకు సంబంధించిన నవల. కల్పితము. శృంగారలతికయను రాజకన్యక తుందుడను రాజకుమారుని మోహించుట, వారికి సమాగమము కాక, ఇరువురు ప్రాణములు విడిచి పిశాచరూపములు ధరించుట, ఒక యోగివలన వారలపూర్వవృత్తాంతము తెలిసికొనుట, కిమిడియను పట్టణమున సకలకళాధురంధరుండను రాజునకు చంపకామోదయను కూతురు కలుగుట, ఆమెకు తెలుంగువెలుంగు అని ఆమె విద్యావిశేషములబట్టి పండితులు పేరుబెట్టుట, ఆమెకవితా చమత్కృతులచే నందరిని మెప్పించుట, చింబోతురాయని యుదంతము- మున్నగున విందు గలవు. అచ్చటచ్చట పద్యములు గలవు. శైలి సరళమై సులభగ్రాహ్యమై యున్నది.

మచ్చునకు—

"కిమిడి యను పట్టణంబున తెలుంగు వెలుంగను పడుపుకత్తియు, యీలోకంబున దనకు సరి తెలుంగు పండితులు లేరనియు,కవులు పశువులేయనియు బలుకుచు వచ్చినవారియెడ తొలుతన ౧౦౦౦ వరహాలొక్క రాత్రికని తీసికొని, యాపిదప నెద్దియో నొక పద్దెము వ్రాసి పంపుటయు,నతం డుత్తరంబివ్వనియెడల నతనిపై పేడనీరు పోయించి చీపురు చేటలచే గొట్టి యవమానం బొనర్చి యనుపుటయు జేయుచున్నయది. దానిచే నవ మతులుం ధనముం గోల్పోయినవారు ననేకులు గల రందులోన నేనును నొక్కండనయ్యు నాధనవష్టంబును నవమానమును నోర్వజాలక యిక్కడకు వచ్చితి (3౭ 3౮ పుటలు) ఇందు 'దీనిభావమేమి తిరుమలేశ!' వంటి యుత్తరప్రత్యయములు గలవు. మచ్చునకు—

పచ్చియారఁబోదు పదియేడులకునైన
గచ్చుకంపు బిట్టుగారునీరు
ఇట్టిదాని విలువయే వేయినిక్కముల్
తగిన విలువబలుకు తడయకిపుడు
ఐనూ రైనూరును మరి
జానగు బోనంబుకూర చవులగుకొటికుల్
మా నగరపు విలువయగున్
మానిని యన్నతంబు రాదు మద్భాషలకున్.

స్త్రీవిద్యాప్రసక్తి, స్త్రీ స్వాతంత్ర్యము పెంపొందు నీ కాలమున నీగ్రంథమావశ్యకముగ ముద్రింపఁదగినది.

చారురర్వీషు కథలు: 1881

వీనినే నలుగురు ఫకీరుల కథలందురు. క్రీ. శ. 1881లో విశాఖమండలమున రివిన్యూ శిరస్తాదారుగా నుండిన ఎర్రమిల్లి మల్లికార్జునుడుగారు దీనిని రచియించిరి. తేట తెలుగు మాటలతో వ్రాయఁబడినది.

దక్కను పూర్వకథలు: చదలువాడ సీతారామశాస్త్రిగారు

సంధులను విడగొట్టి, బహు సులభశైలితో, ప్రజాకర్షముగ వ్రాయబడిన దక్కను పూర్వకథలీ నాటివే. మఱియు సీతారామశాస్త్రిగారే సంస్కృత నాటక కథలను తొలుత రచియించియున్నారు.

ఈ నాటి కథావాఙ్మయమంతయుఁ జిన్నయ సూరిపద్ధతినే యనుసరించి రచితమైనది - వీనిలో గొంచెము కాఠిన్యము సడలినవానిని పాఠ్యగ్రంథములుగా విశ్వవిద్యాలయము వారు నియమించుచు వచ్చినారు. వీనిలో పేర్కొనదగినవి. ఎనమ చింతల సంజీవరాయశాస్త్రిగారి దశకుమారచరిత్ర (1886) దాసు శ్రీరాములుగారి అభినవగద్యప్రబంధము (1893) (పేరిట్లున్నను నిదియొకకథ) చిలకపాటి వేంకటరామానుజశర్మగారి చమత్కారకథాకల్లోలిని. (1897) భోజకాళిదాస కథలు-(1893) గురుజాడ శ్రీరామ

మూర్తిగారి [1] కళాపూర్ణోదయ కథాసంగ్రహము. (1893) చిత్రరత్నాకరము. ఈ కడపటిది, యవన యామినీ వినోదములు Arabian Nights (1889) అను కథలనుండి, రెండు కథలు గైకొనబడి చక్కని శైలిలో రచితమైనది. ఇది పలుమారులు పఠనీయ గ్రంథమైనది.

ఇట్టి శైలిలో రచితమైనదే కీ. శే. పనప్పాకం ఆనందాచార్యులవారి మంజువాణీ విజయము- (1895) కొమాండూరి అనంతాచార్యులవారి సత్యసేన విజయము, (1897) సోమశర్మాభ్యుదయము (1894) పలుకని పద్మావతి కథ (1894)

పైవానికన్న సులభశైలిలోనుండి జనాకర్ష ణీయముగ నుండువానిలో పోకల వెంకటనరసింహ నాయని కమలావతీ పరిణయము లేక ఖండిత మాత్స ర్యము అను కథ (ఇది షేక్స్పియరు మహాకవి 'సింబ లైను' అనునాటకము ననుసరించినది. వకుళాభరణ పరదేశి, 1. సుగుణాకర మహారాజు చరిత్ర 2. శుక మహారాజు చరిత్ర 3. విచిత్ర పతివ్రతల కథలు-తిరు క్కాండము కస్తూరిరంగయ్య గులోబకావళియను పుష్పలీలావతి కథ పేర్కొనదగినవి.

---

1. మొదట తెలుగుభాషలో కళాపూర్ణోదయమును వచన రూపముగ వెలయించినవారు శ్రీరామమూర్తి పంతులుగారే. ఇది క్రీ. శ. 1898 లో ముద్రితమైనది. కళాపూర్ణోదయ కథను సంగ్ర హముగా నొక సీసమాలికలో తడకమళ్ల వేంకటకృష్ణరావుగా రంతకుముందు రచించియున్నారు. ఇది యముద్రితము.

భక్తుల కథలలో నెన్నికగన్నవి, రెండు. 1. శ్రీమహా భక్తవిజయము-కృష్ణపాదుని భక్తిసారము ననుసరించినది. పరవస్తు శేషాచార్యుల కొమారుడు జియ్యరుసూరి రచించినది. ఈతఁడు క్రీ శ. 1840-1895 ప్రాంతములలో జీవించియుండెను. బెంగుళూరి సెంట్రలు కాలేజీలో తెలుగు పండితుఁడుగా నుండెను. ఈ గ్రంథముగాక, రత్నావళీకళామంజరి లేక సౌందర్య శతకమను 110 పద్యముల పద్యకృతిని రచియించినాడు.

రెండవది భక్తలీలామృతము-ఇది శైవవాఙ్మయమునకు సంబంధించినది. ద్రవిడదేశమున ప్రసిద్ధి కెక్కిన యరువత్తుమూవురు నయనారుల చరిత్రలను తెలుపును. సకలార్థసారము మొదలగు బహుగ్రంధ రచయితయగు ఓమండూరి శ్రీనివాస దొరసామయ్య రచించెను. ఈతని వచనరచన చక్కనిది. 1900 లో గ్రంథము ముద్రణ నందినది.

ఈ సందర్భమున ధనాల దేవరాజదాసుని 'భక్తవిజయము' పేర్కొనదగినది.

### పౌరాణికములు

ఈ శాఖలో తొలుత పేర్కొనదగినది కార్మంచి సుబ్బరాయలు నాయనివారి దశావతార చరిత్ర సంగ్రహము. ఇది క్రీ. శ. 1861 లో ముద్రిత

మైనది-తరువాత వెలువడినవానిలో నీ క్రిందివి పరిగణింపదగినవి.

శ్రీ మార్కండేయ పురాణసార సంగ్రహము
తిమ్మరాజు లక్ష్మణరాయకవి. 1876

(వరూధినీ ప్రవరుల సంభాషణ)

ఓ నారీతిలకమా! నే నరుణాస్పగంబను పట్టణంబునుండి, ఓషధిరసమహిమచే నిచటి కేతెంచి తిరుగు నెడ నా రసంబు హిమంబుచే నీరసంబైపోయెగాన మఱల గృహంబున కరుగుట కశక్తుఁడనైతి. నీ వెవ్వతవు? యిచటి కెందుండి వచ్చితివి? నీ భర్త యెవరు? అని యడుగ నవ్వరూధిని యిట్లనియె. ఓ మహాత్మా! నేను మేనకయనుదాని సుతను. నవ్వరూధినియని యందురు. నేని మనోహరంబగు పర్వతంబున వసించెద. నీ సుందరాకారంబును గాంచినమాత్రంబున నా మోహంబు హెచ్చె. కావున నా మనోరథంబొనగూర్పు మన నా ప్రవరుండా వరూధినిని జూచి, "బ్రాహ్మణుండు పరవాసంబు జేయందగదు. దేశాటనము చేయవలయునను కోరిక నను జెఱచె. కాలము తప్పక నిత్యనైమిత్తిక క్రియలను సలుపువాడను. వాటిం ద్యజించిన బ్రాహ్మణ్యము నశించుగాన సూర్యుండ స్తమించుటకు మున్నె నా గృహంబు జేరునుపాయంబుగఱపు" మన నారీమణి దలపులతేనిస్మిత్తించి అయ్యయో..."

ఈ మార్కండేయ పురాణ సంగ్రహమే గాక, పై వెనుక చెప్పబడిన కూర్మపురాణ, మత్స్య పురాణ సంగ్రహములును మూలములతో కూడ, క్రీ. శ. 1876, 1877 సంవత్సరములలో ప్రకటితములైనవి. వీనిని ప్రకటించినవారు శ్రీ పువ్వాడ వేంకటరావుగారు వర్తమానతరంగిణి యను ముద్రాక్షరశాలను నెలకొల్పి యందు పురాణవాఙ్మయమే కాక, యితరాంధ్రగ్రంథముల నచ్చుకూర్పించి, సంస్తవనీయమగు భాషాసేవ గావించిరి. *

శ్రీ కూర్మ పురాణ సంగ్రహము

తిప్పర్తిరాజు లక్ష్మణరాయకవి 1877

(దేవదారు వనవర్ణన)

"పూర్వం బా విపినమున భృగ్వాది తాపసులు ప్రవృత్త నివృత్తంబగు గృహస్థధర్మాచరణం బ్రవర్తిల్లుచుండిరి. వారల న్మాయామోహితులం జేయ గౌరీశుండు దలంచి శౌరింగూడి యవ్వనమున కరుగుచో దవ్వులం దానేకోనవింశతివత్సర వయస్సును స్వర్ణసమాన తనుకాంతియు, లంబిత బాహుయుగ్మంబును నిర్మల శతపత్ర నేత్రములునుగల మోహనాకార సరసుండై దిగంబరుండై పుండరీకాక్షుం డెల్ల బ్రహ్మాండముల మోహింపజేయు యండజయానయై చెంగట

---

* ఈ గ్రంథములన్నియు నాంధ్రపత్రికాధ్యక్షులగు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారి వద్ద కలవు.

రాగ మందగమనమున మునిపల్లియకు జనిన మనసిజ సన్నిభుండును, దినకరకోటిప్రభాసమానుండునగు పశుపతింగాంచి పతుల నుమఱచి సంసారముం దూరి కుమారులం గేరి మారసంగరముం గోరి గుంపులు జేరి యందలి నారీమణులు పురారి వెంటంజన గడ తేరిరి."

మత్స్యపురాణసారసంగ్రహము-1877

ఇది మత్స్యపురాణమునకు సంగ్రహరూపమైన వచనము. పైని తెలిపిన తిమ్మరాజు లక్ష్మణరాయకవి చేతను, పువ్వాడ వేంకటరావు పంతులుగారి చేతను రచితమైనది. పై రచనములవలెనే చక్కనిశైలి గలది.

హరిశ్చంద్రోపాఖ్యాన సంగ్రహము-1882

ఈ వచనరచన నేలటూరి వేంకటసుబ్బశాస్త్రి గారిది.

సావిత్రి చరిత్ర-1887

కాళ్లకూరి భోగరాజామాత్యకవికృతి.

భాగవతము-1897

1897 లో ప్రసిద్ధ వచన రచయితలు నోరి గురులింగశాస్త్రులవారి వచనభాగవతము ప్రకటితమైనది.

వచనహరివంశము-1899

వాగ్వల్లి పత్రికాధిపతి కొమాండూరి వెంకట రామానుజశర్మగారు హరివంశ వచనము రచించిరి.

బ్రహ్మాండ పురాణము-1900

ఇదియును నోరిగురులింగశాస్త్రి గారిదే.

క్షేత్రమాహాత్మ్యములు:

వీనిలో తొలుత చెప్పదగినది క్షేత్రమహిమ సంగ్రహము. ఇది దక్షిణ దేశమునందలి క్షేత్రముల గుఱించి విపులముగఁ దెలిపెడి మహాగ్రంథము-దీని వెనుక తిరుక్కుండము కస్తూరి రంగయ్య శ్రీరంగ మాహాత్మ్యము(1895) లాల్ గోవిందదాసు జగన్నాథ క్షేత్ర మహాత్మ్యము—వల్లభాచార్య చరిత్ర (1900) వెలువడినవి.

శాస్త్రీయ గ్రంథములు:

హిందూధర్మశాస్త్ర సంగ్రహము: క్రీ. శ. 1858

ప్రఖ్యాత పండితుడగు పరవస్తు చిన్నయసూరి కర్నూలు నరహరి గోపాలకృష్ణమ సెట్టిగారి పర్య వేక్షణక్రింద నీ రాజకీయశాస్త్ర గ్రంథమును, నాంగ్లేయ భాషనుండి యనువదించెను. ఇది నీతిచంద్రికవంటి కఠిన శైలిగాక సులభ శైలిలో వ్యవహారానుకూలమై యున్నది.

కామందకము 1860

ప్రసిద్ధ రాజనీతిశాస్త్రమగు నీ గ్రంథమున పద్యరూపముగ పేరుతెలియనికవి రచించిన ప్రాచీన పద్యకృతి యొకటియు, జక్కరాజు వేంకటకవి క్రీ. శ. 1584 లో రచించిన పద్యకృతి వేఱొకటియు గలవు. దీనిని వచనరూపముగ క్రీ. శ. 1860 లో తడకమళ్ల వేంకటకృష్ణారావుగారు రచించిరి. ఇం దిరువదియధ్యా యములు—304 పుటలు గలవు.

(1) విజ్ఞానేశ్వరీయము-వచనము

"రాజైనవాడు క్రోధము లోభము లేక విద్వాంసులైన బ్రాహ్మణులతో గూడుకొని ధర్మశాస్త్రక్రమమున వ్యవహారములు పరామర్శించవలెను. నేరము లేనివారిని దండించినా నేరముగలవానిని దండించకున్నా రాజు కపకీర్తిన్ని నరకమున్ను ధర్మశాస్త్రమునకు విరోధము లేనప్పుడు దేశాది సమయ ధర్మములున్ను ధర్మశాస్త్రసమ్మతమనంబడును. వేదశాస్త్రములువచ్చి ధర్మజ్ఞులై శత్రుమిత్రులయందు సమముగా నుండువారలను సభకు పిన్నపెద్దలను సేయవలయును." (R 314) అముద్రితము కర్త తెలియదు.

2. సరస్వతి తిరువేంగడాచార్యులు (1879)ముద్రితము

పత్రికావాఙ్మయము-

పత్రికలును నీకాలమున గ్రాంథికభాషలోనే వెలువడుచుండెడివి. వానిలో ప్రసిద్ధమగు, తత్త్వబోధినిపత్రికనుండి యొకయుదాహరణము నిచ్చుచున్నాను.

[1]తత్త్వబోధిని - (1864-1869)

(మాసపత్రిక) 1868 ఏప్రియలు

"సుజనరంజని యను తెనుగుపత్రికనుగురించి మున్నొకతూరి యీ పత్రికయందు వ్రాసియుంటిమి గదా! అది కడచిన 67 సంవత్సరముతోడ నిలుపబడి

1. ఈ పత్రిక సంపుటమాంధ్రపత్రికా కార్యాలయమున గలదు.

యున్నది. తత్ప్రవర్తకులు మొట్టమొదట దాని నారం భించినపుడు కొంతకాలములోనే తమపత్రిక తెనుగు దేశమెల్ల వ్యాపించి వన్నెకెక్కు-ననియు, జందాదారు లును పోషకులును బెక్కం్రడు గలుగుదురనియు, దనూ్మలమున నింకను విశేషమైన గ్రంథములను బ్రచు రింపనగుననియు దలచి యీయెన్నికతో రెండుమూడు సంవత్సరములు, దాని జరుపుటయందు ద్రవ్యమును కాలమును వెచ్చించి గేహ్రశమము బుచ్చుకొనుచు వచ్చిరి......దినవర్తమాని యొక్కటితప్ప నాంధ్ర మందు వేఱొక పత్రికయు లేదు. శ్రీ యక్షిణి, హిత వాది యనుపత్రికలు రెండుండెనుగాని యిటీవల నవియు నస్తమించినట్లు కానంబడియెడి. ఈ మూడు పత్రికలు సుజనరంజనికి సమానములు గానేరవు. దీని విశేష ప్రయోజనము నాపత్రికం జూచువారికెల్ల దెల్లంబు గనుక నిట దానింబట్టి వక్కాణించుట యావశ్యకంబు గాదు. ఇది యీలాగు నిలిచిపోవుట త్రిలింగదేశస్థుల దౌర్భాగ్యమనుకొనవలయునుగాని వేఱుగాదు. ఇటు వంటి పత్రికను మఱల నేపుణ్యాత్ముం లేని దలయెత్తనిచ్చి లోకులు హర్ష మొంద నుద్ధరించినవారి కీర్తి యా చంద్రతారార్కంబై వెలయును."

పై యుద్ధృతాంశములంబట్టి మొదట పత్రికలు వ్యావహారిక భాషాసంప్రదాయము ననుసరించినను నా వెనుక గ్రాంథికభాషా పరిపాటి ననుసరించినట్లు తెలియగలదు.

దీని వెనుక వెలువడిన యాంధ్రభాషాసంజీవని గూర్చి చెప్పియున్నాఁడను. ఆ వెనుకవానిలో ప్రసిద్ధి వడసినది యముద్రితగ్రంథచింతామణి. ఈ కాలమున పేరొందఁదగినవి రెండు వారపత్రికలు. శశిలేఖ, ఆంధ్రప్రకాశిక. ఒకటి గట్టుపల్లి శేషాచార్యులవారి చేతను, రెండవది పార్థసారథినాయుడుగారి చేతను నడుపబడుచుండెడిది. రెండవపత్రిక నలుబదేండ్లు నడచినది.

మతము — వేదాంతము—

బ్రహ్మసూత్రటీకాసంగ్రహము

ఇది బాదరాయణకృత బ్రహ్మసూత్రములకు సంగ్రహవివరణము. ఇందైదువందల నలువదియైదు సూత్రములకు తెలుగురచన గలదు. మూడు పద్యము లున్నవి క్రీ. శ. 1864 (రక్తాక్షి)లో రచితమైనది. మచ్చునకు—అథాతో బ్రహ్మజిజ్ఞాసా ౧

ఇంక బ్రహ్మవిచారము చేయఁబడుచున్నది. ఇంక, ననుశబ్దమువలన నింతకుమునుపు కర్మమీమాంసా ప్రశంస చేయఁబడెననియు అందు ప్రతిపాదింపఁ బడిన కర్మమీమాంసోదిత ఫలము, అల్పంబయ్యును నస్థిరఫలంబును నగుట తదనంతరము బ్రహ్మజిజ్ఞాస చేయుంబడునని యభిప్రాయము. ఇచ్చట మతభేదములు, అద్వైతమతమునందు మీమాంసాశాస్త్రము వేఱనియు, వేదాంతశాస్త్రము వేఱనియు పూర్వోక్త

శాస్త్రములు క్రమముగ నమునంబడిన నలువదియెనిమిది సంస్కారములచే సంస్కృతుండగు పురుషునిచే బ్రహ్మవిచారాధికారియగుననియు నా సిద్ధ బ్రహ్మవిచారము చేయఁదగినదనియు దెలియఁజేయును. (సంఖ్య 2141. సంపుటము 9) ఇందులో ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత మతముల వ్యాఖ్యననుసరించి అధికరణభేదములతో ననుకూలించు సూత్రము లేవో పేర్కొనఁబడినవి. అముద్రితము.

యాజ్ఞవల్క్య ప్రభావ మణిమంజూషా సంగ్రహము (1874)
(నల్లాన్ చక్రవర్తి శేషాచార్యులు)

ఇది యాజ్ఞవల్క్యులకు సంబంధించిన విషయములను, ఋషి మాహాత్మ్యమును దెలుపును. మూఁడు వ్యాసములుగల పెద్దవచనగ్రంథము. గ్రంథాంతగద్య. 'ఇతి శ్రీహయగ్రీవ మంత్రానుష్ఠానసమాసాదితసంస్కృత వైకృతాది భాషానివహుండును, శ్రీ భగవద్రామానుజమునివరనిర్మిత చతుస్సప్తతి సింహాసనాంతర్గత తిరుమలై నల్లాన్ చక్రవర్తి వంశసంభూతుండగు శేషాచార్యులచేఁ బువ్వాడ వెంకటరాయావర నియోగంబున రచియింపఁబడిన శ్రీ యాజ్ఞవల్క్య ప్రభావమణి మంజూషయను వచనకావ్యంబునందును సర్వంబును తృతీయోచ్ఛ్వాసము సంపూర్ణము.' ప్రారంభము - "శ్రీమంతంబగు నెల్లజగంబుల సృష్టి స్థితి లయకారణ స్వరూప లీలాపరుండును, పాలకడలితరఁగల తుంప

రలలోఁ గలసిపోవు ప్రేమ్మెరల మొసవృటంజేసి పొదలు సుకుమారశరీరుండగు చెలువేజెలు మైసిజ్జపై సగ్గ మిల్లి యోగన్నిబాసరాయణుండగు శ్రీసున్నాగాయ ముని పాక్కిలితమ్మియందు బాసిటుస బ్రహ్మరాత్రి యను విప్రవగుండు, సకలజనార్తినివారకంబగు శిశిర ఋతువున ఫాల్గున శుద్ధపూర్ణిమతోఁ జేరిన పూర్వఫల్గుని నక్షత్రశోభిత దివసంబున వృశ్చికలగ్నంబున లోకా నందంబు వర్ధిలఁజేయుటకై యవతరించె"

భావసంవత్సర శ్రావణ సు 3 (30-8-1874) ముద్రణము. వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాల.

వేదాంతగ్రంథములలో వల్లూరి జగన్నాథరావు గారి ఆంధ్రశారీరకము, బ్రహ్మసూత్రార్థసంగ్రహము ప్రసిద్ధికెక్కినవి. దుర్భాక వెంకటాచలశాస్త్రిగారి "కర్మోపన్యాసము క్రీ. శ. 1892 లో ముద్రితమైనది.

మతతత్త్వము సులభశైలిలో తెలిపి, యనేక గ్రంథములను రచియించిన వెంకటగిరి ప్రభువగు వెలు గోటి గోపాలకృష్ణయాచేంద్రుఁడు వచనశాఖయందు దాక ప్రత్యేకస్థానమున కర్హుఁడు. 1. సర్వమతసార సంగ్రహము, 2 హిందూమత విరోధభంజని, 3. మన స్సాత్మ్యము, 4. నాస్తికధ్వాంత భాస్కరము, 5. నిర్గుణ వాద నిరాకరణము, 6. సందిగ్ధతత్త్వరాద్ధాంతము మొదలగు వీరిగ్రంథములు సామాన్యజనులు గంభీ

ముగు వేదాంత విషయములు గ్రహించురీతిని వ్రాయ బడినవి. ఇవి 1889-92 సంవత్సరములలో ముద్రితము లైనవి.

సాంఘిక వాఙ్మయములో తొలుత పేర్కొనదగినది సామినేని ముద్దునరసింహానాయుడుగారి, హితసూచిని ఇందులో నెనిమిది ప్రమేయములు గలవు. 1. విద్యాప్రమేయము, 2 వైద్యప్రమేయము, 3. సువర్ణ ప్రమేయము, 4. మనుష్యేతరజంతుసంజ్ఞాప్రమేయము, 5. రక్షఃప్రభృతి ప్రమేయము, 6. మంత్రప్రమేయము, 7. పరోక్షాదజ్ఞాన ప్రమేయము, 8. వివాహప్రమేయము. 1862లో ముద్రితము. దీనితరువాత హిందూజన సంస్కారిణీ పత్రికాధిపతులగు మన్నవ బుచ్చయ పంతులుగారి, కామినీదుర్గుణదూషణము తన్నివారణమార్గములు-అను వ్యాసము క్రీ. శ. 1891 లో ముద్రితమైనవి.

నవల రచనలు

నవ్యవాఙ్మయశాఖలలో నాంగ్లేయ భాషా సంస్కారప్రభావము హెచ్చుగా గలిగినశాఖ నవలయే యని చెప్పనొప్పును-ఈశాఖయందలి ప్రాథమిక రచనము లప్పటి భాషాపరిపాటినిఁబట్టి గ్రాంథికభాషలో రచితములు-వానిలో మొదటిది కొక్కొండ వేంకట

1. వీనిలో కొన్నిటినుండి భాగములు గద్యచింతామణియందుదాహృతములైనవి.

రత్నము పంతులుగారి 'మహాశ్వేత' అనునది. ఇది మన భాషలో మొదటినవలయని కీర్తిశేషులు శివశంకర పాండ్యాగారు, వేంకటరత్నము పంతులుగారి జీవిత చరిత్రలో నిట్లు వ్రాసియున్నారు. "In 1867, he (Venkataratnam Pantulu) composed the first Telugu Novel by name Mahasweta founded on the pleasant story of Kadambari, the master piece of Bana Bhatta in Sanskrit."

(ఇందులో కొంతభాగము వైజయంతి పత్రికలో ప్రకటితమైనది.)

క్రీ. శ. 1872 లో కర్నూలు నరహరి గోపాల కృష్ణమ్మ సెట్టిగారు 'రంగరాజచరిత్ర' అను నవల వ్రాసి ప్రకటించియున్నారు.

(ప్రబుద్ధాంధ్ర, జనవరి 1924. ప్రతిభ సం॥ నం. 3.)

క్రీ. శ. 1878 లో వీరేశలింగము పంతులవారు "[1]రాజశేఖర" చరిత్ర అను వచనగ్రంథమును ప్రకటించిరి. అది యాంగ్లేయభాషలోని గోల్డుస్మిత్తు అను కవి రచించిన వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు (Goldsmiths Vicar of Wakefield) అనుదాని ననుసరించినది. దీనిని నవ

1. Translated into English by J. Robert Hutchinson. London, 1887

వివేక చంద్రికా విమర్శనము-రాజశేఖర చరిత్ర విమర్శనము, కాశీభట్ల బ్రహ్మయ్య. 1896

లగా భావించుటచేతను, వీరేశలింగముగారే తాను మొదటి నవలా రచయితనని చెప్పుకొనుటచేతను, నీ గ్రంథమునకు నవలత్వమబ్బినది. దీని ముందు వెనుకల చరిత్రననుసరించిన నీ విషయము స్పష్టమగును.

1 నవల రచనమును తొలుత ప్రోత్సహించినది 'చింతామణి' అను మాసపత్రిక. ఇది రాజమహేంద్ర వరమున కీ. శే. న్యాపతి సుబ్బారావు పంతులుగారి యాజమాన్యమున క్రీ.శ. 1892-1899 వఱకును వెలు వడినది. అయినను వీరేశలింగము పంతులుగారే పత్రి కను నడిపెడివారు. వారు తమ గ్రంథములను, ప్రాచీన కవికృత గ్రంథములను వెలువరించిన దీపత్రికయందే యని తెలియునగును. తెనుగున నవలరచనమును ప్రోత్సహింపదలచి పంతులవారిద్దఱును నొకపోటీపరీక్ష నేర్పఱచిరి. రచయితలు తమ యిచ్చవచ్చిన కథా వస్తువు స్వీకరించి, దానిని నవలరూపమున వెలువరింప జేయవలెననియు, భాష సులభగ్రాహ్యముగ నుండ వలయుననియు బహుమతులు పొందిన కృతులు పత్రిక యందు ప్రకటింపవలయుననియు నియమములు చేసిరి. అట్లువచ్చిన రచనలలో ప్రథమస్థానముగా గణింపం దగిన నవలకు నూటయేబది రూప్యములును, ద్వితీయ స్థానము నందినరచనకు డెబ్బదియైదు రూప్యములును బహుమతిగా నిర్ణయింపబడినవి. దీనికి ముగ్గురు పరీక్ష కులు. శ్రీ సుబ్బారావు పంతులుగారును, వీరేశలింగం

పంతులువారు గాక, భాషాశాస్త్రయవిశారదులై, ప్రసిద్ధులైన వావిలాల వాసుదేవశాస్త్రిగారును నిందు పరీక్షకులుగ నుండిరి.

తొలుత నీ పత్రికను శ్రీ సుబ్బారావు పంతులుగారు క్రీ. శ. 1881 వ సంవత్సరమున ప్రారంభించి యొకయేఁడాది నడిపిరి. కీ. శే. వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'ఆంధ్రభాష' అను ప్రశస్తవ్యాసమును ప్రకటించినదీపత్రికయే.

క్రీ శ. 1893 లో ప్రథమమున నీపోటీ నెలకొల్పబడినది. అప్పుడు పంపబడిన నవలలైదింటియందును నీక్రిందివానికి ప్రథమ ద్వితీయ బహుమానములు లభించినవి.

1. ధర్మవతీవిలాసము. ఖండవిల్లి రామచంద్రుఁడు-మొదటిబహూకృతి.

2. సంజీవరాయచరిత్ర-తల్లాప్రగడ సూర్యనారాయణరావు-రెండవబహూకృతి.

2. తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు న్యాయవాదులై, భాషాపోషకులై కవులై విమర్శకులై, ఆంధ్రగీర్వాణ విద్యాలయమును కొవ్వూరిలో స్థాపించిన ప్రఖ్యాతపురుషులు - వీరు సువర్ణరేఖ అను మాసపత్రికను నడిపియున్నారు. షేక్స్పియరు Merchant of Veniece అను నాటకమును వెనీసు వర్తకోదంతము అను పేర తెలిగించినారు. వీరాంధ్రీ

కరించిన 'కుందమాల' కొంత 'శారద' పత్రికలో ప్రకటితము. దుర్యోధనుదురోదరము లేక ద్రౌపదీ వస్త్రాపహరణము అను స్వతంత్రనాటకము బంకించం ద్రుని 'చంద్రశేఖరము' అను నవలను రచించిరి. 'ప్రభావతీ ప్రద్యుమ్నమునకు ప్రశస్తపీఠిక వ్రాసి ప్రకటించిరి.

ఇందు తొలిరచయిత ఖండవిల్లి రామచంద్రుఁ డా కాలమున గంజాము మండలమున రసూలుకొండయం దొక ప్రాథమిక పాఠశాలలో నుపాధ్యాయుఁడు- విశా లాంధ్ర దేశమున నేమూలనో నొక బడిపంతులు, ఆంగ్లేయ సారస్వత పట్టభద్రులనుగూడ నాశ్చర్యచకి తులంగావించు నవలను తొలుత రచించుట ప్రశంస నీయముగదా! ఈ గ్రంథమును ప్రశంసించుచు శ్రీ వాసుదేవశాస్త్రులవారు పద్యములనుకూడ వ్రాసి యున్నారు. ఈ గ్రంథములు 'చింతామణి' పత్రిక యందే ముద్రితమైనవి.

గ్రంథము ముఖపత్రములపై Dharmavati-vilasamu 1893. Chintamani First Prize Novelette అని ముద్రితమైనది. సంజీవరాయ చరి త్రమును క్రీ. శ. 1894 లో ముద్రితమైనది.

(సం. 15. పుటలు 98)—సం. 16. పుటలు 56)

క్రీ. శ. 1894—:చిలకమర్తివారి యావిర్భావము:—

తన ప్రసన్నమధుర వచన పద్యరచనలచే నాంధ్రదేశమునంతను తన్మయత్వమునొందించిన చిలక

మర్తి లక్ష్మీనరసింహాకవి తన ప్రథమ నవలయగు 'రామచంద్రవిజయమును' క్రీ. శ. 1894 లో సీపోటీ పరీక్షకుఁ బంపెను – మఱికొన్ని రచనములును వచ్చినవి. వానిలో మొదటిబహుమానము 'రామచంద్ర విజయమునకును' రెండవ బహుమానము, '[1]శ్రీ కోటి కనకరాజు'గారిచే రచింపబడిన 'వివేక విజయము–' నకును పరీక్షకులొసంగిరి. ఈతరువాత బహుముద్రణములనందిన రామచంద్రవిజయమునుగూర్చి ప్రత్యేకముగ ప్రశంసింప నగత్యము లేదు.

క్రీ. శ. 1895 సంవత్సరపు పోటీలకు తిరిగి ఖండవల్లి రామచంద్రుఁడు పోటీచేసెను. ఆ సంవత్సరమున వచ్చిన మూడు రచనలలో [2]తేకుమళ్ళ రాజగోపాలరావుగారి త్రివిక్రమ విలాసమునకును,

---

1. వీరు మదరాసు ప్రభుత్వమువారి 'యాంధ్రభాషాంతరీకరణోద్యోగు'లై కీర్తిశేషులైరి. తమ యుద్యోగములోనుండి 'ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణచరిత్ర' రచించిరి. అది బందరులోని ఆంధ్రభాషాభివర్ధనీ సంఘమువారు ప్రకటించిరి.

2. తేకుమళ్ళ రాజగోపాలరావుగారు క్రైస్తవ కళాశాలయందు, దేశభాషాపర్యవేక్షకులుగను తెనుగుభాషోపన్యాసకులుగనుండి, భాషావాఙ్మయచ్ఛందస్సులలో ప్రశంసనీయమగు పరిశోధనలు సలిపి కీర్తిశేషులైరి. తమ పరిశోధనల నాంగ్లేయభాషామూలమున వ్యాప్తిఁజెందించినారు. ఇదియెంతయు నభినందింపదగినది. వీరు 'South Indian Research' అను పత్రికను నింగ్లీషులో నడిపినారు. తెనుగున చాల గ్రంథములు రచించి భాషాసేవ గావించినారు.

రామచంద్రుని 'మాలతీమాధవము' అను రచనము నకు ప్రథమ ద్వితీయ బహుమాకృతుల నొసగిరి.

సం. 27. పుటలు 64

త్రివిక్రమ విలాసము 68 పుటలు - సంఖ్య 26

ఈ సంవత్సరముననే 'ఆంధ్రోద్యమ పితా మహుఁడని, చెప్పదగినమహామేధావి రెంటాల వెంకట సుబ్బారావు పంతులుగారు 'కేసరీ విలాసము' అను నవల రచించి ప్రకటించిరి. అది యెంతో సులభ శైలినుండి చదువరుల నాకర్షించుచున్నది.

క్రీ. శ. 1896 లో పోటీలలో తిరిగి చిలకమర్తి వారే ప్రథమస్థానము వహించిరి. వారి 'హేమలత'కు ప్రథమ బహుమానము వచ్చినది. మొదటిది 'రామచంద్రవిజయము' అచ్చముగా నాంధ్ర దేశీయ మైనకథ. 'హేమలత' ఉత్తర హిందుస్థానమున రాజపుత్రస్థానమున చారిత్రక కథ. ఆసంవత్సరపు రెండవ బహుమతి ఖండవిల్లి రామచంద్రుని 'లక్ష్మీ సుందర విజయము' అను గ్రంథమునకు వచ్చినది.

సం. 31. పుటలు 90.

క్రీ. శ. 1897 లో లక్ష్మీనరసింహముగారి 'అహల్యాబాయి' అను నవలయొకటియే బహుమా నార్హమైనదిగా నిర్ణీతమైనది.

క్రీ. శ. 1898 లో చిలకమర్తివారి కర్పూర మంజరికి ప్రథమబహుమానమును కూనపులి లక్ష్మి

[1]నరసయ్యగారి 'భక్షీ' అను నవలకు ద్వితీయ బహుమానమును లభించినవి.

ఈవిధముగా నవలరచయితలలో నగ్రగణ్యుడైన చిలకమర్తి కవికి తొలుత దోహదమిచ్చినది 'చింతామణి' పత్రికయే. చిలకమర్తికన్న ముందు ప్రథమ బహుమతినిపొంది, యాతని వెన్నాడుచు ద్వితీయుఁడైన ఖండవిల్లి రామచంద్రుడుఁకూడ తెనుగు నవల రచయితలలో నగ్రస్థానము వహించుచున్నాడు. తెనుగున మొదటి నవలా రచయిత కాకపోయినను వీరేశలింగము పంతులుగారీ శాఖను ప్రారంభమున పెంపొందించినవారిలో ప్రథములని చెప్పుటకేమాత్రమును సందేహము లేదు.

## చరిత్ర

తెనుగు దేశ చరిత్రమును తొలుత వ్రాసిన వారు తిరుమల బుక్కపట్టణము రాఘవాచార్యుల వారు. దీనికి 'తెనుగు రాజుల చరిత్ర' అని పేరు. ఇది క్రీ. శ. 1881 నుండి శాసనాధారముల నుదాహరించుచు వ్రాయఁబడినది. ఇందు రెండు సంపుటములు మాత్రమే లభ్యములైనవి. ఇది యముద్రితము. క్రీ. శ. 1879 లో మామిడి సారంగపాణి మచిలీబందరు చరిత్రను, క్రీ. శ. 1885 లో ఒడయారు వీర

1. కూనపులి లక్ష్మీనరసయ్యగారు క్రీ. శ. 1906 లో 'శ్రీనాథ చరిత్రము' అను గ్రంథము వ్రాసి; చెన్నపురి రాజధాని కళాశాల ఆంధ్రభాషాభివర్ధనీ సమాజమువారిచే బహుమతినందిరి.

నాగయగారు చాణక్య చరిత్రను వ్రాసిరి. క్రీ. శ. 1894 లో తోలేటి వేంకటసుబ్బారావుగారు వీరేశలింగకవి చరిత్రను వ్రాసిరి. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు కవిజీవితములను పేర కవుల చరిత్ర నే కాక యీక్రింది చారిత్రక గ్రంథములను వ్రాసిరి. 1. రావు వంశీయుల చరిత్ర (1895) 2. బెండపూడి అన్న మంత్రి చరిత్ర (1896) 3. అప్పయ దీక్షిత చరిత్ర (1897) 4. తిమ్మరసు చరిత్ర (1898) 5. మాధవ విద్యారణ్య చరిత్ర. 6. రాయన భాస్కర మంత్రి చరిత్ర (1899) విశ్వాసము వేంకటరమణయ్యగారి శివాజీ చరిత్రము క్రీ శ. 1899 లో రచితమైనది. ఇదియే శివాజీనిగూర్చి తెలుగున వెలువడిన ప్రాథమిక రచన – దీనికి ద్వితీయమైనది, యద్వితీయమైనది లక్ష్మణరావుగారి శివాజీ చరిత్ర.

## భాషావాఙ్మయము – వ్యాసములు – ఉపన్యాసములు

### —భాష—

తెనుగుభాషనుఁగూర్చి యధునాతన భాషా

---

1. ఈ బుక్కపట్టణము రాఘవాచార్యులవారు కేవలము చారిత్రకులే కాదు, ప్రశస్తకవులు. వీరు రచించిన కువలాశ్వచరిత్రము ప్రబంధము ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. ఈతడు తన 16వ యేట అభినవపండితరాయమాడభూషి వేంకటాచార్యుల వారి సమక్షమున మూఁడుభాషలలో ననఁగా సంస్కృతము, తెనుగు, ఇంగ్లీషులలో నవధానముచేసి యాయనను మెప్పించినా డట. (చూడుడు కువలయాశ్వ చరిత్ర పీఠిక – అముద్రితము. ఈ. రాఘవాచార్యులవారినిగూర్చి తొలుత తెలిపినవారు కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు (1928 ఆంధ్రపత్రిక ఉగాది సంచిక)

తత్త్వశాస్త్ర పద్ధతులపై రచింపబడిన యుపన్యాసములలో కీర్తిశేషులైన వావిలాల వాసుదేవశాస్త్రిగారి "ఆంధ్రభాషను గూర్చిన యుపన్యాసము" అనునది ప్రథమముగా నెన్నదగినది. ఇది క్రీ. శ. 1831 లో రచితమైనది. చింతామణి పత్రికలోఁ బ్రకటితము. ఇప్పటి ద్రావిడభాషాతత్త్వశాస్త్రవేత్తల పుట్టుకకు బూర్వమే, కాల్డువెలుదొరవారి సిద్ధాంతముఁ బరిశీలించి వ్రాసినదీవ్యాసము. దీనివెనుకనే బహుభాషా విశారదులు తాతవెల్లి మిరాదార్ (టి. యమ్.) శేషగిరిశాస్త్రిగారు 1893 లో నర్ధానుస్వారతత్త్వమును 1896 లో నాంధ్రశబ్దతత్త్వము రెండుభాగములును ప్రకటించినారు. కా. గోపాలరావు నాయుడుగారానంవత్సరముననే, 'ఆంధ్రభాషాచరిత్ర సంగ్రహము' అను నుపన్యాసమును గ్రంథరూపమునఁ బ్రకటించిరి. క్రీ. శ. 1900 లో ప్రకటితమైన పరవస్తు రంగాచార్యులవారివర్ణనిర్ణయమిచట పేర్కొనదగినది. ఇది చింతామణి పత్రికలో ముద్రితము. ఆనాటి భాషావిషయక వ్యాసములలో నముద్రితగ్రంథచింతామణి పత్రికయందు క్రీ. శ. 1885 నుండి 1900 వఱకు వెడలిన వ్యాసములు ప్రశస్తములైనవి. శబ్దస్వరూపము శబ్దసాధుత్వము - వీనిని నిఘంటు కవి ప్రయోగానుసారముగ, సోపపత్తికముగఁ జూపుట మున్నగు విషయములిందు కూలంకషముగఁ జర్చింపఁబడి నిర్ణ

యుంపఁబడియున్నవి. ఈ నిర్ణాయకములు భాష యందు పరిశ్రమచేసి యారితేరిన పండితులచేఁ జేయఁ బడినవిగాన ప్రామాణికములుగా వెలసినవి. పరిఘా పరిఖాశబ్దద్వయ విచారము - రేఫద్వయవిచారము - ఙకార కకార వివేచనము - ప్రాసాదిస్థలముల శబ్ద స్వరూపము - మున్నగునవి యిందు ముఖ్యముగఁ బరిశీలింపఁదగినవి.

వాఙ్మయము - విమర్శన

చెన్నరాజధానీకళాశాలలలో, నాంధ్రభాషాభి వర్ధనీ సమాజమువారి బహుమతినిబొందిన దక్షిణా మూర్తిగారి పింగళి సూరననుగూర్చిన యుపన్యాసము శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగా రుదాహ రించియున్నారు. ఇది 1893లో ముద్రితము. క్రీ.శ. 1896 లో పోలవరము జమీందారగు శ్రీ కొచ్చర్ల కోట రామచంద్ర వేంకటకృష్ణారావు బహద్దరువారు- 'ఆంధ్రభాషాభివృద్ధి' అనుపేర వాఙ్మయ విషయిక వ్యాసముఁ బ్రకటించిరి. క్రీ.శ. 1898 లో 'భాస్క రోదంతము' అనుపేర భాస్కర రామాయణ కర్తృ త్వమునుగూర్చి కాశీభట్ట బ్రహ్మయశాస్త్రిలవారొక పెద్దవిమర్శక గ్రంథమును ప్రకటించిరి. 1899 లో వెన్నేటి రామచంద్రరావుగారి 'మనువసుప్రకాశిక' యను విమర్శన గ్రంథము వెలువడినది. ఇదియును పైసమాజమువారివలన బహుమతి వడసినది. దీనిపై కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిలవారు మనువసుప్రకా

శిక విమర్శనము - విమర్శనానుబంధము అను రెండు గ్రంథములు వెలయించిరి. వారే క్రీ. శ. 1900 లో నన్నయభట్టారక చరిత్రమును 'సరస్వతి' పత్రికా ముఖమున వెలయించిరి.

### యాత్రాచరిత్రలు (Travels)

ఈకాలమున వెలువడిన యాత్రాచరిత్రలలో పోతకమూరి జానకమ్మగారి ఇంగ్లండు చిత్రములు యాత్ర అనునది ముఖ్యమైనది. ఇది 1876 లో ముద్రితము. ఆవెనుక మానవల్లి త్యాగయ్యగారు కాశీయాత్రాచరిత్రను, (1886) మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు యాత్రాచరిత్రను వెలయించినారు. లాడ్ గోవిందదాసుగారి (1892) 'కాశీత్రోవ' అను యాత్రాచరిత్ర పేరొ్కనఁదగినది. ఇది 1898 లో ముద్రితము.

### అంతఃపురోపన్యాసములు (Curtain lectures)

ఈ రచనలను చేసినవారు ఆచంట సుందర రామయ్యగారు. వీరి యంతఃపురోపన్యాసములు 'చింతామణి' పత్రికలో ప్రకటితములైనవి.

### లేఖావాఙ్మయము (Letter writing)

ఈ వాఙ్మయశాఖ బ్రౌనుదొరవారి కాలములో ప్రారంభమైనను, తరువాత యంతగ నభివృద్ధినందలేదు. ఈతరువాత అముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతులు, విద్యావిషయికమై తమకు

వచ్చిన జాబులనన్నింటిని అముద్రితగ్రంథచింతామణి జాబులు అనుపేర నొకపుస్తకమును ప్రకటించినారు. ఆపుస్తకముఁజూచిన, నాకొక్కొక్కప్పుడు జాబులమూల మునగాక తంతీవార్తమూలమునగూడ తమ యభిప్రాయములను తత్క్షణమే తెలిపెడివారన్నచో నాకాలమునందు భాషావిషయికమైన యెంత యభినివేశముండెడిదో గ్రహింపనగును. (చూ. ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి తంతీవార్తలు) ఇక పండితులుత్తరములెట్లు వ్రాసెడివారో మచ్చునకు నీక్రింది జాబును నాపత్రికనుండి యుదాహరించుచున్నాను.

శ్రీ నాగపూఁడి కుప్పుసామయ్యగారు శతఘంటము వేంకటరంగశాస్త్రిలవారికి వ్రాసినయుత్తరము.

సిరులకిరవై, చదువులకుఁ గుదురై, యీవికిఁ బావలమై, దిట్టతనంబునకు మనికిపట్టై నీటునకుఁజోటై మోరుపునకు మేరయై ప్రేముడికిఁగీమై, నాణెములకు దానకమై పొంకములకు డెంకియై, చల్లదనంబుల కిల్లై, గొనమ్ములకిమ్మై యెమ్మెయింగ్రాలుచుఁ గతంబేదియు నాయెడదద్దయుంబో రామిగారాములు నెఱపుచువఱలు నా యనుంగునెయ్యునకు బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగయ్యగారికి నాగపూఁడి కుప్పుసామయ్య పల్మఱు నెఱఁగి యెఱుకపఱచు విన్నపంబులు.

ఒండొరుల నేమంబులఁగూర్చి యడిగికొనిన పిదంపడి. ఇంతకుమున్ను యిరుమాఱులు తమ పేర

బత్తిరికలు వనిపికొనియున్నవాఁడ. బ్ర. శ్రీ. తమ తండ్రిగారి పేరఁ దయచేసిన విన్నపంబులు నిన్నన యందినయవి. తమ సేమంబు దెలిసి మిగుల నెలమి గలిగె. ఇచటఁ జిన్నలు పెద్దలులోనగు మనవారలెల్ల రును లెస్సయున్నారు. బ్ర. (శ్రీ). తమయయ్యగారు తమకున్న యెకల నెట్లట్ల నెల్లవెంటల నెలమియైఁ జెలఁగెదరు.

ఇప్పుడొక్క పాఁఱుఁడు మన యింటికి కెక్కడే నుండ యరుదెంచి నెల్లూరికిఁ గుఱఁగటఁ గొంచమించు మించుగ మూఁడు క్రోసుల దవ్వునఁ బినాకిని యేటి యొడ్డున పాటూరను పల్లెయున్నదనియుఁ దెనుఁగుఁ గబ్బపుఁ గూర్పరులలోఁ గడు నేర్పరియై వెలుపుఁ బెద్దతో నుద్దినాదద్దయు శేరెన్నికఁగన్న తిక్కన్నగారి యిల్లిప్పటికి నున్నదనియు, నందు తిక్కన వంగడపు వారలున్నారనియు, వారియింటఁ దిక్కన చే వ్రాయ బడిన తెలుఁగు భారతమును నతనిగంటమునఁ గలవ లనియు మఱియు నెన్నియో శాస్త్రంబులు మొత్తంబులు గట్టలుకట్టలుగా నొకసలకపైఁ బెట్టఁబడియున్నవని, యిట్టి యపురూపంపు వింతలు వ్రాకుచ్చె. గ్రక్కున దమకిక్కత యొల్లఁ దెలిసి దీని నిక్కవంబిదియని తెలియఁగోరి వ్రాయుచున్నాఁడను. తమరు నామాట గీటునంబుచ్చక పాటూరునకొకపూట యరిగి యక్కడ నంతయు లెస్సగా నారసి చెచ్చెరనాకు, దెలిపిననే

గాసమకట్టి యున్నవాఁడ కాన దప్పక యరుగ నేఁడెద.

ఇట్లు విధేయుఁడు దెలుచు తమయడకుడు విధేయ్యుఁడు శ్రీ కాళహస్తి నాగపూఁడికుప్పుసామయ్య, బి. యే. (౧౩-౭-౧౯౯౯)

ఈజాబు వ్రాసినవారు నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు సుప్రసిద్ధ విద్వాంసులు; విమర్శకులు విద్వత్కవులు - కేంద్ర మహోన్నత న్యాయస్థానమున న్యాయమూర్తులై యుపకృతి వడసిన నాగపూఁడి చంద్రశేఖరయ్యగారి తండ్రిగారు.

అభినవాంధ్ర కవితాపితామహులు మంచపాల పార్వతీశ్వరశాస్త్రిగారు, గ్రంథాలయోద్యమ పితామహులు నిడుదవోలు సుందరముపంతులుగారికి వ్రాసిన లేఖ:

సుధీనిధీ! తామీవల నిచ్చటికి వచ్చియున్నప్పుడు, బిందుపూర్వకతటవర్గయతులనుగూర్చి ప్రయోగములున్నట్లుగా మన గోష్ఠిలోఁ దెలిపితిరి. నేఁడు తదావశ్యకత గలిగియున్నవాఁడఁగావున, వాని బంపఁ బ్రార్థించుచున్నాఁడ. ప్రత్యుత్తరంబునఁ బలుమాఱపేక్షింపనైతినని యుపేక్షింపఁకుఁడు. త్వరలోఁ బంపుఁడు. ఈ లేఖతో మద్విరచితమగు 'రాధాకృష్ణ సంవాదమును' బంపుచున్నాఁడను.

క. పరమాదరమున సీభా
సురకృతి శ్రీ నిడుదవోలు సుందరకృతికిన్
నరమండపాక కామే
శ్వరపుత్రుండు పార్వతీశ శర్మయొసంగెన్.

అచ్చుతప్పులచ్చటచ్చట విచ్చలవిడిగ మచ్చుమీఱి
పెచ్చుపెరిగియున్న యవి గాన మచ్చరములేని సచ్చరి
తులు సరిపుచ్చుకొని, ముచ్చటఁగొని నుచ్చరించి
మెచ్చుగనవచ్చును.

శ్రీ బొబ్బిలి విధేయమిత్రము మండపాక
౩౯-౮-౧౮౯౫ పార్వతీశ్వర శాస్త్రి

చిరునామా:

శ్రీ విజయనగరపుఁ బోస్టుమేస్టరుగారగు మహా
రాజ శ్రీ దేవగుప్త సన్యాసిరాజ కవిరాజశేఖరులు
దీనిని జిత్తగించి, బ్రహ్మశ్రీ నిడుదవోలు సుందరము
పంతులవారిచ్చటనున్న నచ్చటనందింపఁ బ్రార్థితులు.
విజయనగర మహారాజధాని.

(పార్వతీశ్వరశాస్త్రిగారు క్రీ. శ. 1833-1897
లోను, నాజనకులగు సుందరము పంతులుగారు క్రీ. శ.
1864-1931 లోను జీవించియుండిరి.)

నవవచన యుగనిర్మాత శ్రీ వీరేశలింగకవి

ఆంధ్రుల సాంఘిక సారస్వత జీవితములకు
నూతనోత్తేజము గలిగించి, అద్యతనకాలమున
నాంధ్రుల సర్వతోముఖాభ్యుదయమునకు తోడ్పడిన

మహాపురుషుడు వీరేశలింగము. ఆంధ్ర సారస్వత
పథకమున నీతడు త్రొక్కిన నూతనమార్గములన్నియు
నంతకుముందు వెలసినవియే. ఆంధ్ర సారస్వతమున
క్రీ. శ 19 వ శతాబ్ది ప్రథమపాదముననే నవయుగము
ప్రారంభమైనది. అయినను వీరేశలింగము వాఙ్మయ
రంగమున ప్రవేశించునాటికి సాహిత్యపథకము పండి
తాధీనమై యుండెను. పరవస్తు చిన్నయసూరి,
కొక్కొండ వేంకటరత్నము మున్నగు దిగ్గజముల
వంటి విద్వన్మహాకవుల నియంతృత్వమున నాంధ్ర
సాహిత్యము వెలసినది. నవ్యవాఙ్మయ ప్రపంచము
నకు నూతనశోభ నొడగూర్చిన ప్రత్యేక సాహిత్య
శాఖలన్నియు పైవారిచే ప్రాచీనపద్ధతిని క్షుణ్ణము చేయ
బడినవి. నవయుగముపై నేటికిని తన యనుపమాన
ప్రభావమును చూపుచున్న ముద్రాయంత్రసౌలభ్యము
విశ్వవిద్యాలయ స్థాపనము, ఉన్నతవిద్యయం దుత్తమ
సాహితీ విశిష్టత — ఈ నవ్యసంస్కృతికి దోహదమొన
గినవి. దీనికి చెన్నపురమే కేంద్రస్థానమైనను విశ్వ
విద్యాలయమునకు సంబంధించిన కళాశాల లేర్పడుట
వలన ఆంధ్రదేశమున నొండు రెండు పట్టణములను
గూడ నిది వ్యాప్తమైనది. అప్పటికి ప్రాచీనరీతిని
సంస్కారముగల పండితులు నీ నూతనమార్గములను
గ్రహించి, సంఘమున కేవలము జ్ఞానవంతులగుకొలది
మంది సాహితీపరులకే దీని నుపాదేయమగునట్లు కావిం
చిరి. ఆనాడు వచన రచన, వ్యాసములు, ఉపన్యా

నములు, ప్రతికారచనములు, విద్యార్థుల కొఱకు వ్రాయబడిన గ్రంథములు, శాస్త్రీయగ్రంథములు— వేదేల, సమస్త వాఙ్మయమును పండితులైనవారు గ్రహింపఁదగినరీతిలోనే యుండెను. అనగా పండితుల దృష్టిలో ప్రజాసామాన్యము సామాన్యమైనదిగనే పరిగణితము. ఇట్టి సంకుచితమగు పాండిత్యదృక్పథము నుండి సాహిత్యమును తప్పించి, ప్రజానీకమువైపున నీ నవ్యసంస్కారవాహినిని మఱల్చిన మహావ్యక్తి వీరేశలింగము. ప్రజలలోఁగల నిసర్గమగు నఖండశక్తిని గుర్తించి పండితాధీనముననున్న, విజ్ఞానమును పండితులకేకాక పామరులకు, బాలురకేగాక బాలికలకు, అగ్రవర్ణములకేగాక హరిజనులకు, పురుషులకేకాక స్త్రీలకు, సమస్తమైనవారికి, జాతిమతవిచక్షణ ననుసరింపక తమమాతృభాషలో, అతిసులభగ్రాహ్యమగు రీతి నందించి, వారిని విజ్ఞానవంతులుగ నొనరించి భాషాభివృద్ధిగావించి, తన్మూలమున సంఘసంస్కరణము గావించి, జాతీయాభ్యుదయమునకు, దేశాభ్యుదయమునకును మూలపురుషుడగుటచే వీరేశలింగము నవ్యయుగమునకు శకకర్తయైనాడు.

## గ్రాంథికవచనరచన

వచనకావ్యములను ప్రాచీన ప్రౌఢపండితుల రీతిని రచించు సామర్థ్యము తనకుగలదని తెలుపుటకు ఈయన చిన్నయసూరి ననుసరించి నీతిచంద్రిక నంది

విగ్రహములను రచియించెను. ఇవి నేటికిని విద్యార్థి లోకమునకు పఠనీయములైయున్నవి. కాని యిట్టి రచన వీరేశలింగకవికి సహజము కాదు. ప్రాచీన సంప్రదాయములను నిలువబెట్టు నుద్దేశముతో నిట్టి రచన కావించినాడు. ఇట్టి యభిప్రాయముతో అవధానము చేసినాడు. ఆశుకవి ననిపించుకొన్నాడు. శతకములను రచించినాడు; సాహితీప్రౌఢిమను వెల్లడించినాడు. పైరీతిని ప్రాచీనపథకమును అవిచ్ఛిన్నముగ నిల్పుచు నవీనపద్ధతి నెట్లనుసరించినాడో తెలిసికొనుట యావశ్యకము.

నవీనపథకమున ప్రధానమైనది గద్యరచన. ఎట్టి సూక్ష్మతరములగు శాస్త్రీయ విజ్ఞానాంశముల నేమి, ఎట్టి మహోన్నత భావముల నేమి సర్వజనసులభముగ గ్రహించు వచనరచనకు సృష్టికర్త వీరేశలింగము. ఆ రచన, సంస్కృతసంపర్కమున్నను తెలుగుదనము కలిగియుండుటచే నీతనికి గద్యతిక్కన యను బిరుదము సార్థకము.

"నే నేర్పఱచుకొన్న భాషాభివృద్ధి మార్గము తెలుగుభాషలో మృదువైన, సులభశైలిని, సలక్షణమైన వచన రచన చేయుట" అని వివేకవర్ధనీపత్రికాముఖమున నాతడే తనరచనాపద్ధతిని తెలిపియున్నాడు. వీరేశలింగము శైలియందు 1. సులభగ్రాహ్యత, 2. వైశద్యము, 3. సమత, 4. జీవము ముఖ్యలక్షణములు.

వీరి గద్యరచనల నీ క్రిందిరీతిని విభజింపనగును. (౧) నవల (౨) కథలు (3) ప్రసిద్ధ స్త్రీ పురుష జీవిత చరిత్రలు (౪) వ్యాసములు (౫) ప్రహసనములు (౬) గ్రంథవిమర్శనములు (౭) చారిత్రకగ్రంథములు (౮) పత్రికారచనలు (౯) శాస్త్రగ్రంథములు (౧౦) ఉపన్యాసములు.

౧ నవల:—ఈ నవీనశాఖ 'రాజశేఖర చరిత్ర'తో ప్రారంభము కాకపోయినను నీ నవల ప్రశస్తి కెక్కినది. వీరేశలింగకవి దీనికి మార్గదర్శకుఁడు కాకపోయినను చింతామణిపత్రికలో నవలలకు బహుమతు లేర్పఱచి, వానిని బరీక్షించి, ప్రకటనార్హముగు వానికి బహుమతులిచ్చి ప్రకటించి, ఆరంభదశలో నీశాఖావ్యాప్తి కెంతయేని తోడ్పడెను. అట్టి నవలలలో మొదటిది "ధర్మవతీవిలాసము" అనునది. దీనికి వీరేశలింగము పంతులవారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, న్యాయపతి సుబ్బారావుగారు పరీక్షకులుగ నుండి తీర్పు చేసినారు. ఆ వెనుక వచ్చినది చిలకమర్తి వారి 'రామచంద్రవిజయము'. దీనినిగూర్చి నవలరచన శీర్షికలోఁ జూడనగును.

౨. కథలు:—బాలురకునీతికథలు, ప్రౌఢులకు సత్యరాజాపూర్వదేశ యాత్రలు మున్నగు రచనములు వ్యాప్తములైనవి. ఇవి యనువాదములైనను స్వతంత్రరచనములై వెలయుచున్నవి. మొదటిది నీతిదాయకము. రెండవది చిత్రకథావిలసితము.

3 ప్రసిద్ధ స్త్రీపురుష జీవిత చరిత్రలు:— జీవితచరిత్ర లెట్లు వ్రాయవలెనో, జీవితచరిత్ర రచనమున నేయే విషయములకు ప్రాధాన్యమొసగవలెనో తెలియజేయుచు నివి మార్గదర్శకములై యున్నవి. విక్టోరియా మహారాజ్ఞి చరిత్ర, జీసస్ చరిత్ర నేటికిని చదువదగినవిగా నున్నవి.

సంఘసంస్కరణమున పితంతు వివాహాదుల గావించి స్త్రీజనోన్నతికై తన జీవితము ధారవోసిన వీరేశలింగకవి స్త్రీలకొఱకు కొంతవచనవాఙ్మయము సృష్టించెను. స్త్రీలకు విజ్ఞానముకొఱకు, సత్ప్రవర్తన నలవఱచుకొనుటకు, ఆరోగ్యముకొఱకు ఉత్తమ స్త్రీ చరిత్రములు, స్త్రీవిద్య, అతిబాల్యవివాహము మున్నగు వచన నాటకములు, పత్నీహితసూచని, సతీహితబోధిని అను గ్రంథములను నాతడు రచించెను. నేటికి తెలుగునాటిలో స్త్రీవిద్య యిట్టి యున్నతస్థితియందుండుటకు వీరేశలింగకవి యమోఘపరిశ్రమయే కారణము.

౪. వ్యాసములు:—ప్రత్యేక ప్రత్యేక శీర్షికలతో, వక్తవ్యాంశమును విషయ విభాగము చేసి, అతిదీర్ఘమును, నతిక్లుప్తమునుగాక వివరించు లఘురచనకు వ్యాసమని పేరు. దేశాభిమానము, సత్ప్రవర్తన, నైతికవిషయములు మున్నగువానిని గూర్చి వ్రాసి వ్యాసరచనాపథకమును దిద్దితీర్చినది వీరేశలింగమే.

౫. ప్రహసనములు:—ఈ రచనమున వీరేశలింగకవి సిద్ధహస్తుడు. సంస్కరణాభిలాషియగునీతనికీ రచనము ఇతరులను నొప్పింపకుండ, సాంఘికలోపములను బహిర్గతమొనర్చి, సంఘమును సరియగు మార్గమున నడిపింపజేయుట కనువైనది. దీనికితోడు వ్యావహారికభాష ప్రయుక్తమై, సభ్యమగు హాస్యమును గలిగి, పాత్రోచితమై, స్వభావసిద్ధమగు రచనముతోనుండుటవలన వీరి ప్రహసనములు మిక్కిలి న్యాయ్యములైనవి. మనభాషలో ఇట్టి కవిత్వములున్నవిగాని ప్రహసనములు లేవు. ప్రహసనము ఆంగ్లేయభాషలో 'ఫార్సు' అయినది. వీరేశలింగకవి చిన్నవి ౩౮, పెద్దవి ౨౮-మొత్తము ౫౮ ప్రహసనములను రచించెను. అపూర్వ బ్రహ్మచర్యము, విచిత్ర వివాహము, ఆచారము - హిందూమహాజనుల మతసభ, మహాబధిరప్రహసనము, బలాత్కార గాన వినోదప్రహసనము మున్నగునవి గణింపదగినవి.

౬. గ్రంథవిమర్శనములు:—ఇందులో ప్రధానమైనది వెంకటరత్నకవి విగ్రహతంత్రి విమర్శనము. ఇందు గ్రంథము కేవలము వ్యక్తిగతము కాకుండ, సాహిత్యవిమర్శకదృష్టి నెట్లనుసరింపవలెనో వివరింపబడినది.

౭. చారిత్రక గ్రంథములు:—ఇవి మూడు విధములు: (౧) స్వదేశసంస్థాన చరిత్రలు; (౨)

స్వీయచరిత్ర; (3) ఆంధ్రకవుల చరిత్రలు. వీనిలో నెల్లఆంధ్రకవుల చరిత్రము ప్రధానమైనది. వీరేశలింగకవి మూడుభాగములలో క్రీ. శ. ౧౦ వ శతాబ్ది నుండి ౧౯ వ శతాబ్దాంతమువఱకు గల 330 మంది కవుల చరిత్రమును వ్రాసి ప్రకటించినారు. ఈనాడు వీరేశలింగము గ్రంథములలో నిదియే ప్రచురమై సాహిత్యవిమర్శనమున కాధారమై యున్నది. స్వీయ చరిత్ర వచనరచనమునను వీరేశలింగముమార్గదర్శియే. అంతకుముందున్న స్వీయచరిత్రలు పద్యాత్మకములు, వీరేశలింగము తన స్వీయచరిత్రను నిష్పక్షపాతముగ రచించి, రెండు సంపుటములుగా నాంధ్రలోకమున కొసగెను.

౮. పత్రికారచన:—వివేకవర్ధనీ పత్రికను స్థాపించి, దానిమూలమున స్త్రీ పునర్వివాహ విషయ ములను చర్చించుటయేగాక, 'హాస్యసంజీవని' యందు హాస్యరచనల బ్రకటించి, వీరేశలింగము పత్రికా సారస్వతమునకు నవీనవాఙ్మయమున ప్రథమస్థానము సంపాదించినాడు.

౯. శాస్త్రీయ గ్రంథములు:— ప్రాచ్య పాశ్చాత్యశాస్త్రీయ గ్రంథములను సులభశైలిలో రచించి యావిజ్ఞానము నందజేసినవ్యక్తి వీరేశలింగము. దీనికొఱకు సాంకేతిక పదజాలముకూడ నాతడు తనకు ముందున్నవారినుండి గ్రహించినాడు. ప్రాచ్య

విజ్ఞానమునకు సంబంధించిన తర్కసంగ్రహము, వ్యాకరణసంగ్రహము, అలంకారసంగ్రహము, కావ్యసంగ్రహము మొదలగునవిగాక జ్యోతిశ్శాస్త్రమును రచించెను. జంతుశాస్త్రము, శారీరకశాస్త్రము (Physiology) మున్నగువానిని తెలుగులోనికి దెచ్చెను.

౧౦. ఉపన్యాసములు:—వీరేశలింగము వివిధ విషయములపై నాయా సందర్భములలో చేసిన ఉపన్యాసములన్నియు సులభగ్రాహ్యములై, చదువుటకనుకూలముగ నున్నవి. రాజకీయవిషయములు, దేశీయమహాజనసభ - దాని యుద్దేశములు, సంఘసంస్కరణ మహాసభాధ్యక్షోపన్యాసము మున్నగునవి యీ రచనలలో ప్రసిద్ధములు.

సభలు - ఉపన్యాసములు.

నవ్యసాహితీరంగమున నుపన్యాస శాఖకొక ప్రత్యేక విశిష్టస్థానముగలదు. నేటివ్యవహారములో సాధారణముగ సమావేశములయందు, సభలయందు లిఖితరూపముగా కాక, వాగ్రూపముగా చెప్పిన వాసకే "యుపనాస్యములు" అనివాడుక యున్నను నొకప్పుడది వ్యాసమునకుకూడ పర్యాయ పదముగానున్నది. ఆంగ్లేయభాషలోని Bacon's Essays అనుగ్రంథము తెనిగింప బడినపుడు దానిపేరు 'బేకనుపన్యాసములు' అనిముద్రితమై ప్రకటితమైనది. నేటికిని హిందీభాషలో నుపన్యాసమునకు వ్యాసమనియే పేరు.

అతివిపులముగాకుండ, అతిసంగ్రహముగాకుండ నుద్దిష్ట విషయమునుగాని, నిర్దిష్ట విషయముగాని, నియమితమైన పుటలలోని ముదు రచన వ్యాసమని చెప్ప వచ్చును. అదియెట్లయినను చదువుటకు నియమిత కాలమేర్పట్టెను. అదియును ప్రత్యేకముగాగాక నొక సమావేశమునందో, సభయందో గోష్ఠియందో చదివిన నదియుపన్యాసము కావచ్చును- కావునతొలుత నుపన్యాస వ్యాసములకు రచనయందు విశేషభేద మేమియు లేదని చెప్పనగును. ఈ వ్యాసరచన మైనను మన వాఙ్మయశాఖలలో నొకనూతనశాఖ. ఇదిపత్రికా వాఙ్మయమువలన నేర్పడినది. పత్రికలయందు విషయ ములు, సుదీర్ఘములుగానుండి, పాఠకలోకమునకు విసువుగలిగించుటకు వీలులేదు. కావున విషయసంగ్ర హణము శైలిసౌలభ్యము, విన్యాసపరిమితిగల రచన లావశ్యకములైనవి. అవియే వ్యాసములు - తెలుగు పత్రికలు ప్రారంభమైననాటనుండి వ్యాసములందు గాననగును. కాలక్రమమున నవియే తొలుత నుపన్యాస ములను పేర వాగ్రూపమున వెలువడి తరువాత గ్రంథ రూపమునుదాల్చినవి-ఇచ్చట నింకొకముఖ్యవిషయము కూడ గ్రహింపదగినదికలదు. పూర్వసభలయందే యుపన్యాసములైనను, గ్రాంథికభాషలోనే యుండెడివి గాని యిప్పటివలె వ్యవహారిక భాషలో నుండెడివికావు కాబట్టి యవి వాగ్రూపమైనను లిఖితమైనపుడు వ్యాస రూపముననే యుండెడివి.

నవీనయుగమునపై యుపన్యాసశాఖాచరిత్రము నెఱుంగుటకు మనమానాటి దేశకాలపరిస్థితులను గూర్చిస్థూలముగ తెలిసికొనవలసియున్నది. ఈశాఖ క్రీ. శ. 1870 నుండి ప్రారంభమైనది. ఇప్పటివలె నాకాలమున సభలు సమావేశములు లేవు. ఉన్నను నవి ప్రజాసామాన్యమున కందుబాటులోలేని పండిత పరిషత్తులు. ప్రభువుల యాస్థానములు మాత్రమే. క్రీ. శ. 1857 లో మదరాసు విశ్వవిద్యాలయము మేర్పడి ఆంగ్లేయ భాషాద్వారమున నున్నత విద్యాశిక్షణయే గాక దేశభాషలలోకూడ నుత్తమసాహిత్యసంపదాయిక మగు విద్యగఱపబడు చుండెడిది. పాశ్చాత్యసంస్కృతి నాగరకత సంస్కారములను గ్రహించిన యాంగ్ల భాషా ధురంధరులగు నాంధ్రయువకులకును, కొంత వఱకునింగ్లీషు నేర్చి యుద్యోగస్థులైయుండిన పెద్దలకును మనప్రాచీన సంస్కృతి మన మతసాంఘిక పరిస్థితులు, మనసాహిత్య విశిష్టత తెలుసుకొనుటకు నాకాలమున నొకనూతనావేశము పొడమినది.

ఇట్టియభినివేశము కలిగినను, అప్పటిప్రభుత్వ కార్యస్థాపన విద్యాశాఖా ప్రణాళికలనుబట్టి యట్టి వారందఱును నొకచోట సమావేశమై, ఒక నియమిత కాలములో తామెఱుగగోరు విషయములను గ్రహించుటకు ననువగు పరిస్థితు లేర్పడలేదు. అట్టిసమావేశములు జరిగినను విషయముల నెఱుకపఱచువారు,

ప్రాచీన పండితులేయగుటచేతను, వారైనను పాండిత్య ప్రకర్షను ప్రకటించు పత్రికలనొకరినొకరు వ్యక్తి పరముగా వ్రాసికొనుచు, వాదము చేయుటతప్ప ప్రజాసామాన్యమున కనుకూలరీతిని ప్రాచ్యవిజ్ఞానమును ప్రచారము చేసి సాంఘికోత్తేజనము కలిగించువారు లేరైరి. కాని మన విజ్ఞానమంతయు నిట్టి పండితుల యాధీనమందుండుటచేతను, సంస్కృతభాషలోనుండు మూలగ్రంథములను చదివియర్థము చేసికొని విషయ గ్రహణము చేయువారిసంఖ్య, అత్యల్పముగా ననగా వేయిమందిలో నొక్కరికైన లేకుండుటచేతను నాగ్రంథములైన నందఱకిని సులభముగా లభింపక పోవుట చేతను అట్టిప్రాచీన పండితులే యీసమావేశములకు నుపన్యాసములకు మూలపురుషులు కాదగినపరిస్థితి యేర్పడినది.

క్రీ. శ. 1870 లో సీసమావేశ మహోద్యమమునకు మార్గదర్శకులైన మహాపండితు లిరువురు. ఒకరు విశాఖపట్టణవాస్తవ్యులు, పండిత మండలాఖండలులు ప్రథమమహా మహోపాధ్యాయ బిరుదాంకితులు పరవస్తు రంగాచార్యులుగారు. రెండవవారు మద్రాసు వాస్తవ్యులు పండితాగ్రేసరులు ద్వితీయమహా మహోపాధ్యాయ బిరుదాంకితులు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు. ప్రాచీనరీతిగా పండితులు వ్రాసికొను పత్రికావాదములను విరమింపజేసి

సభల నేర్పాటుచేసి నియతోపన్యాసములిచ్చుపద్ధతి మొదట చెన్నపురిలోనేకాక యావదాంధ్రదేశమున నిల్చినకీర్తి వేంకటరత్నము పంతులుగారిది. వారు చెన్నపురిలో "హిందూశ్రేయోభివర్ధనిసభ" యను సభ నేర్పాటుచేసి ప్రతిపదునైదుదినములకు కళాశాలావిద్యార్థులను ఉద్యోగస్థులను నియమితకాలమున వచ్చునట్లు చేసి తాముపన్యాసమిచ్చుచుండెడివారు. విశేషమేమన తెనుగురాని గొప్ప యఱవకన్నడ పండితులు గూడ బిల్చించి వారియుపన్యాసములను తాము తెలుగులో తెలుపుచుండెడివారు. చెన్నపురిలోని ఈసభ ప్రారంభమైన ఒక ఏడాదికి విశాఖపట్టణములో "ఆర్షమత సభ" స్థాపితమైనది. దానికి నియతోపన్యాసకులు రంగాచార్యులవారు. వీరు ప్రత్యేకముగా క్రైస్తవమత ప్రవాహము నరికట్టుటకు హిందూ మతోద్ధరణము కొఱకు మనమతములనుగూర్చియు శ్రుతిస్మృతి పురాణేతిహాసములను గూర్చియు సరియగు నభిప్రాయములు గలుగునట్లు చేసిన మహనీయులు. హిందూశ్రేయోభివర్ధనీ సమాజవృత్తాంతము లాకాలమున వేంకటరత్నము పంతులుగారిచే బ్రకటింపబడుచుండెడి ఆంధ్రభాషా సంజీవని పత్రికయందు, ఆర్షసభావృత్తాంతములు "సకల విద్యాభివర్ధని"యను రంగాచార్యులవారి పత్రికయందు ప్రకటితములగుచుండెడివి. ఈ పండితులిరువురు, ప్రాచ్యవిజ్ఞానమును జీర్ణించుకొన్న విద్వాంసులగుట

చేతను అసమానమగు వాగ్ధోరణి కలవారగుటచేతను, ఉపన్యాసములు కొంచెము కఠినశైలి నున్నను, విద్యావంతుల నందఱను నాకర్షించి సమ్మోహితులజేసి వైచెడివారు. ఆనాటి యుపన్యాసముల ధోరణియెట్లుండెడిదో, శ్రీరాయసం వేంకటశివుడుగారు వ్రాసిన "వీరేశలింగ సంస్కృతి" అను గ్రంథములో 6-8 పుటల నుండి యుదాహరించిన యీక్రింది భాగమునుండి తెలియగలదు.

"వీరేశలింగముగారికి మత విషయమునగల యట్టిసమధికభావ విశాలత మాకొక్కసారిగ ద్యోతకమైనదిగాదు. 1889 వ సంవత్సరము అక్టోబరు 27-వ తేదిని ప్రార్థనసమాజ సభయందాయన "ఈశ్వరదత్త పుస్తకములను" గూర్చిన యుపన్యాస మొసఁగినప్పుడు నేనచటనేయుండి, పలుకు పలుకు సత్యాతురమున వీనుల గ్రోలుచుంటిని. హిందూమత గ్రంథములందు వారికన్నులకు ఈశ్వరహస్తము పొడసూపకున్నను, ఆకాలమున నాకెంతయు గౌరవపాత్రమైన బైబిలునైన యాయన ప్రశంసింపఁడ యని యాత్రపడుచుంటిని. కాని "తల్లి చెవులు తెంపిన వానికి పినతల్లి చెవులు పిండి పోకలుకావు" అనునట్టుగ ఈమాత్మమత విమర్శకుని తీవ్రవాదము ముందట అన్యమతము లేవియు నిలువకుండెను. ప్రకృతికాంత ముఖసీమను మానవ హృదయ పీఠమునను, దేవసేవనిరూప సందర్శనము

చేయ నగునను వారిసిద్ధాంతము నాకపుడంతగ గ్రాహ్యముగాకున్నను, క్రైస్తవమత సూత్రములను బట్టుకొని యూగులాడుటను నేనంతటితో విరమించు కొంటిని.

వివిధమత సంఘర్షణము తఱచుగ జరుగు చుండుట కప్పటిపరిస్థితులు మిక్కిలి యనుగుణ్యముగా నుండెను. ఆనవంబరు మాసారంభమున విశాఖపట్టణ వాస్తవ్యులు, పండిత ప్రకాండులునగు శ్రీపరవస్తు రంగాచార్యులవారు రాజమహేంద్రవరమున కేతెంచి కొన్ని ప్రసంగములు గావించిరి. ఆనెల 2, 3, 4, 10, 13 తేదీలందు సాయంసమయమున బాలికాపాఠశాలా భవనకుడ్యములు రంగాచార్యులవారి గంభీరోపన్యాస గర్జనములచే మాటిమాటికి మారుమ్రోగు చుండెను. ఆచార్యులవారు మంచియొడ్డుపొడుగుగలిగి యొప్పెడు వారు. వారికప్పుడు రమారమి యేఁబది వత్సరముల ప్రాయముండును. మంచివాగ్ధాటి గలవారు. జన రంజకముగ ప్రసంగించుట యందసమానులు. ఎంతటి కఠినాంశమునైనను కరతలామలకముగ చేయఁగల యపారబోధనా సమర్థతగల మహనీయులు. అద్వైత మతాభిమాన మగపఱచుచు చేసినవారి ప్రథమోప న్యాసమువిని సభికులు హర్షపులకాంకితులైరి కాని నభ్యుల రుచులననుసరించి యొకత్రాటిలో తమయభి ప్రాయములను సరిది నవరించుకొనుట యందతిసమర్థు లని కొందఱు వీరిని నిరసించుచుండిరి. ఐననిది

యీర్ష్యాజనితమగు నారోపణమని నేనువిశ్వసించి యుంటిని. మూఁడవ తేదిని వారు భారత దేశమతములను గూర్చి యుపన్యాసముగావించి- యువకులనత్యుత్సాహ పరవశులను జేసివైచిరి. అచటనే కొంత సేపటికి జరిగిన మాప్రార్థన సమాజసభలో, వీరేశలింగముపంతులు గారు ఆచార్యులవారి ముఖ్యసిద్ధాంతములను పూర్వ పక్షము చేసి, సభ్యులకుఁగొంత యుపశమనము గావించిరి.

4-వ తేదీని మరల రంగాచార్యులవారి మహో పన్యాసముజరిగెను. రాజమహేంద్రవరమున నపుడు మహారాష్ట్రపాఠశాలను స్థాపించి జరుపుచుండెడి ముత్తుస్వామిశాస్త్రిగారు, అత్యధిక భావోద్రేకచిత్తుఁడై, సభానంతరమున వేదిక నెక్కి, ఆచార్యులవారికి ప్రణమిల్లి తానిదివఱకు క్రైస్తవమతము నమ్మి యుండినను, ఉపన్యాసకుల యనుగ్రహమున నాఁటి నుండియు హిందూమతోన్ముఖుడైనట్లు చెప్పివేసెను. ఒకముత్తుస్వామి శాస్త్రికేకాదు - అదివఱకు హిందూ మతము దెసనౌదాసీన్యము వహించియుండు పెక్కండ్రు విద్యాధికులకును మాతృమతమునందభిమానము చిగిరింపసాగెను.

10-వ తేదిని దేశీయమహాసభను గుఱించి ఆచార్యులవారు ముచ్చటించిరి కాని రాజమహేంద్ర వరమునందలి విద్యార్థివిద్యాధికుల మనములను గలియ ద్రిప్పివైచినది 13-వ తేదిని జరిగినసమావేశమే. నాఁడు వీరేశలింగము పంతులుగారు అగ్రాసనాధిపత్యము

వహించిరి. పాండిత్యగరిమతోను ప్రబలవాగ్ధోరణితోను సొంపెనలారెడి యాచార్యులవారి ప్రసంగము కడు హృద్యముగా నుండెను కాబట్టి ప్రారంభదినములలో, నీసభాసమావేశములు నుపన్యాసములును, వ్యక్తి వక్తృవక్త గౌరవమునుబట్టి కొంతవఱకుమాత్రమే సభ్యులకు జిజ్ఞాసాప్రోత్సాహములను కలిగించెడివి.

సభాసమావేశములను, ఉపన్యాసములను జాతి యాభ్యుదయముననొక మహోత్తరసాధనముగా పరిణమింప జేసిన దూరదర్శి వీరేశలింగంపంతులు. పంతులు గారికి వక్తృత్త్వము లేదనుమాట సర్వజనవిదితము. ఐనను వక్తకు వక్తృత్వమే ప్రధానము కాదనియు, అది పంచదార పానకమువలె నొకప్పుడుమాత్రమే ప్రయోజనకారి యనియు, సర్వజనలభ్యమగు మంచి నీటివలె సులభగ్రాహ్యమగు శైలిలో విషయవిభజనము కావించి, చెప్పిన యంత క్లిష్టవిషయమైనను సభ్యులు గ్రహించి, దానినిగూర్చి మనము చేసిన కార్యాచరణకు గడంగుదురని మొదటచాటిచెప్పినదీ మహాశయుడే. పంతులవారి యుపన్యాసము లన్నిటియందు నీక్రింద వివరించిన లక్షణములు గన్పట్టును.

(1) చెప్పవలసిన విషయములలోని భావములను స్పష్టపరచుటకు విషయవిభజన గావించుట.

(2) అక్షరజ్ఞానము కలవారి కెల్లఱకెందు బాటలోనుండు సులభమైనరచన గలిగియుండుట.

(3) కఠినసంధులు, దూరాన్వయము లేక, రచన సరళతగలిగి, మార్దవము గలిగియుండుట.

(4) సంస్కృత శ్లోకములేవైన ఉదాహృతములైనచో దానిక్రింద తెలుగుతాత్పర్యము చెప్పుట.

(5) వ్యవహారరీతిని భాషలో ప్రయుక్తమగుచున్న యన్యదేశీయములను, తెనుగుసంప్రదాయ ప్రకారము వాడుట.

(6) జాతీయముల నౌచిత్యమును పాటించి ప్రయోగించుట.

నాటికినీ, నేటికినీ, పంతులుగారి రచననుమించిన రచన లేదనియే చెప్పవచ్చును. నవ్యయుగమునందలి ప్రపంచజ్ఞానము నీనాడు మన తెనుగుభాషలో ననువదించుటకు తగినరీతిగ వచనరచనను సంస్కరించి, దానికి స్థిరత్వము గల్పించి, తెనుగువారికి నూతనోజ్జీవమును ప్రసాదించినది వీరేశలింగమే!

ఈ యుపన్యాసములు దిద్దితీర్చిన వ్యాసములవలెనుండి విద్యార్థులకు, విద్వాంసులకెట్లు సుగమముగ విషయవిభాగము గావింపబడియున్నవో తెలుపుటకు "విద్యాధురీణుల యర్హకృత్యములు" అను నుపన్యాసమునుండి ఈక్రింది విభాగముల నిచ్చుచున్నాను.

"దేశక్షేమమునకై, విద్యాధికులు చేయవలసిన కార్యములు మితిమీఱి యున్నందున వానినన్నింటిని

విషదించుటకు శక్యముగాదు వానిలో గొన్నింటిని మాత్రమిందు పేర్కొని మిగిలిన వాటిని విడిచిపెట్టెదను. 1. వ్యవసాయవిషయములు. 2. శిల్పాదికర్మలు. 3. ఆరోగ్య ధర్మములు. 4. నీతివృద్ధి. 5. అతిబాల్య వివాహములు 6. వితంతువివాహములు. 7. అపాత్రదానము. 8. స్త్రీ విద్యాస్వాతంత్ర్యములు.

## ఉపన్యాస కాలసూచిక

ఈ సంపుటమున బ్రకటితములైన యుపన్యాసముల కాలక్రమము.

15. 8. 1875 ఐకమత్యము.

7. 1879 స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము.

3. 8. 1879 స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము

9. 1879 ,, ,, ప్రవర్తక సమాజ విజ్ఞాపనము.

12. 10. 1879 ,, ,, ద్వితీయ ,, ,,

1880 హిందూమతములు.

.... వర్ణములు.

1881 అతిబాల్య వివాహము.

.... జన్మాంతరము.

20. 1. 1882 స్త్రీ పునర్వివాహ శాస్త్రసంగ్రహము.

౨. 1883 విద్యాధురీణుల యర్హాకృత్యములు.

9. 6. 1885 రాజమహేంద్రపుర స్త్రీపునర్వివాహ చరిత్రము.

5. 4. 1886 ప్రార్థన.

15. 1. 1887 స్త్రీపునర్వివాహ వ్యాపారము యొక్క భూతభవిష్యద్వర్తమానములు.

26. 3. 1887 దానములు.

27. 10. 1889 ఈశ్వరదత్త పుస్తకములు.

9. 3. 1891 ఈశ్వరోపాసనము.

30. 4. 1892 మానుషధర్మము.

5. 5. 1893 వేశ్యకాంతలగూర్చి యుపన్యాసము.

1893 విద్యాధికుల ధర్మములు.

1894 సహాయకష్ట కర్మలు.

,, స్వయంకృషి.

1895 వైరాగ్యము.

1896 జీవిత పరమార్థము - దానిని పొందు లాభములు.

6. 6. 1897 విగ్రహారాధనము.

8. 6. 1897 గోదావరిమండల సాంఘికసభలో చేసినప్రసంగము.

పైవానిలో చివరిదితప్ప తక్కిన యుపన్యాసము లన్నియు ప్రార్థనసమాజమున, విజయనగరము మహారాజావారి బాలికా పాఠశాలయందు చేయబడి యున్నవి.

ఈ సంపుటమున నుపన్యాసములను మూడు విధములుగా విభజింపవచ్చును. 1. మతము 2, స్త్రీపునర్వివాహ విషయము 3. సాంఘికప్రవృత్తి. హిందూమతము, వర్ణము, జన్మాంతరము, విగ్రహారాధనము, వైరాగ్యము అనునవి మతసంబంధములైనవి. అతిబాల్యవివాహములు, రాజమహేంద్రవర స్త్రీపునర్వివాహ చరిత్రము స్త్రీపునర్వివాహ విషయకోపన్యాసము, స్త్రీపునర్వివాహ విషయ ప్రథమ, ద్వితీయ ప్రవర్తక సమాజ విజ్ఞాపనములు. స్త్రీపునర్వివాహ శాస్త్ర సంగ్రహము, స్త్రీపునర్వివాహ వ్యాపార భూతవర్తమాన పరిస్థితులు, వితంతువివాహమునకు సంబంధించినవి. అనాథ స్త్రీబాలికలనుద్ధరించి, యాంధ్రదేశమున సంఘమున కుత్తేజకరమగు సంస్కరణ కొఱకు తన జీవితసర్వస్వమును ధారపోసిన వీరేశలింగము పంతులుగారి యుపన్యాసములలో నీవిషయము ప్రధాన స్థానమలంకరించిన దగుట యతిశయోక్తిగాదు. వీరేశలింగము పంతులుగారును, వారిసహచరులును నెన్నెన్ని శ్రమలుపడి యెట్టి దుష్కర పరిస్థితుల కెదురీది, యీమహోద్యమము జయప్రదముగా నడిపించి నదియో యీ యుపన్యాసములుజదివిన తేటపడును.

మఱియు, వీరేశలింగము పంతులవారి విజ్ఞానసంపత్తి, కార్యదీక్ష, మానసిక ధైర్యసాహసములు వీనిలో ప్రతి వాక్యమునందును ప్రతిబింబించుచున్నవి. తత్కార్యాచరణమున నెట్టి విఘ్నములు వచ్చినను, స్థిరచిత్తముతో భగవంతునిసమ్మి పరిశ్రమచేసిన మన ప్రయత్నములు సర్వదా ఫలవంతములగునను సూత్రమును వారిట్లాచరణలో పెట్టి తెలుగువారిని నిశ్చిత కార్యోత్సాహులుగా దృఢవ్రతులుగా జేసినదియో యీయుపన్యాసములు దేటతెల్లము సేయుచున్నవి.

పరిశుద్ధాస్తిక మతతత్త్వములు ప్రబోధించుటకును, సాంఘిక ప్రవృత్తియందు మార్పుగలిగించుటకును, యీశ్వరదత్త పుస్తకములు, యీశ్వరోపాసన, ప్రార్థన, జీవితపరమార్థము, దానిని పొందుమార్గము యను నుపన్యాసములు పంతులువారు చేసిరి. వివిధశాఖలుగా చీలి, భిన్నభిన్న భావములతోనున్న సంఘమును జాతిమత వివక్షత లేకుండ నందరికి సమాన హక్కులుగల యేకేశ్వరారాధనమును, వారిందు ప్రతిపాదించిరి. ఇట్లు పరమార్థమును, సంఘముసాధించునట్లు చేయుటయేగాక యైహిక జీవితమును మానవుడెట్లు సమన్వయింప జేసికొనవలయునన్న యాదర్శము గూడ ఫలోన్ముఖమగునట్లుగా, స్వయంకృషి, కాయకష్టకర్మలు, ఐకమత్యము మానుషధర్మములు, విద్యార్థికుల ధర్మముల నిందు పంతులుగారు వివరించినారు.

రాజకీయ సంస్కరణముల కర్తలమగుటకు సంఘసంస్కరణము మొదట కావలయును. ఈనాడు రాజకీయముగా మనకుగల్గిన స్వాతంత్ర్యమునకు మన సంఘమర్యాదగడియించిన దన్నచో నది వీరేశలింగము పంతులుగారి సంఘసంస్కరణ మహోద్యమఫలితమే యని ఘంటాపథముగ చెప్పనొప్పును. విద్వాంసులకే కాక విద్యార్థులకు, పండితులకేగాక పామరులకు స్త్రీలకేగాక పురుషులకు, సర్వాంధ్రజనులకు పఠనీయములైన యుపన్యాసములను నాంధ్రసారస్వత ప్రపంచమున నొకప్రత్యేకశాఖగా ప్రతిష్ఠితము గావించినకీర్తి వీరేశలింగకవిది.

ఈ గ్రంథమున ప్రాచీన కాలమునుండి క్రీ. శ. 1900 వఱకును వర్ధిల్లిన వచన వాఙ్మయ చరిత్ర తెలుపబడినది. ఆనాటినుండి యర్ధశతాబ్దిగా నతి విస్తృతమైన నవ్య వచన వాఙ్మయ చరిత్ర, వేఱొక సంపుటిలో వెలువరింతును.

అనుబంధము

ప్రాచ్యలిఖిత పుస్తకభాండారముననున్న వచన గ్రంథములు కర్త తెలియరానివి. అద్వైత వేదాంతమునకు సంబంధించిన గ్రంథములు 1. ఆత్మదర్శనము, 2, ఆత్మబోధము, 3. ఘటచక్రనిర్ణయము, 4. జీవేశ్వరనిర్ణయము, 5. నిగమార్థతత్త్వము, 6. పంచీకరణము, 7. పిండోత్పత్తి ప్రకరణము, 8. మహా

వాక్యప్రకరణము, 9, వివేకసారము, 10. వేదాంత నిర్ణయము, 11. వేదాంతవిషయము, 12. వేదాంత సారము, 13. సకలోపనిషత్సారము, 14. సప్తప్రకరణము, 15. సిద్ధాంతసారము.

శైవము

జంగమ కాలజ్ఞానము. ప్రభుదేవర వాక్యము. మిశ్రార్పణము. మిశ్రార్పణవిషయ వివరణము, మూలస్తంభము. లింగైక్య వచనము. వివేక చింతామణి. షట్స్థలజ్ఞానము. విశ్వబ్రహ్మపురాణము.

విశిష్టాద్వైత మతమునకు సంబంధించిన గ్రంథములు

1. అర్థపంచకజ్ఞానము, 2. అర్థపంచక వివరణము, 3. అష్టాదశార్థములు, 4. ఆచార్యాభిమానము 5. జ్ఞానాంజనము, 6. తత్త్వత్రయము, 7. తత్త్వత్రయ జ్ఞానాదికము, 8. తత్త్వత్రయసారము, 9. తదీయారాధన ఫలము, 10. తిరుమంత్రాచార్య శిష్య ప్రవర్తన, 11. నిగమనప్పడి దశవిధ వైష్ణవలక్షణములు పంచసంస్కారఫలము పదివార్తలు, పరబ్రహ్మ సకల విలక్షణత్వ నిర్ణయము, ప్రసన్నపరిత్రాణము ప్రమాణ త్రిలట్టు మోక్షశాస్త్రము (అచ్చి రామానుజయ్య కృతి) రామానుజరహస్యత్రయము విష్ణ్వైక్యనిరూపణము వైష్ణవప్రశంస వైష్ణవనయము శ్రీ వైష్ణవవైభవము.

---